# రక్తజ్వాల

జ్యోతిగ్రంథమా

శంకరశెట్టి
వెంకట్రావు



# రక్తజ్వాల

[ స్టేజి డ్రామా ]

రచన :
శంకరశెట్టి వెంకట్రావు
విజయవాడ — 2.



పబ్లిషర్సు
ఆంధ్రరత్న బుక్ డిపో తెనాలి
ప్రొ॥ గ్రంధి లక్ష్మయ్య శ్రేష్ఠి



1969

[వెల : రు. 4—00

ప్రథమ ముద్రణ డిశంబరు 1962 – 2000 కాపీలు
ద్వితీయ ముద్రణ ఆగష్టు 1969 – 2000 కాపీలు
వెల : రు. 4.00 మేలు ప్రతి : 5.00

## —: హెచ్చరిక :—



డా॥ చంద్రమౌళి సత్యనారాయణరావుగారు

## అంకితం

సర్వవిధముల నా శ్రేయస్సునుగోరి నా నాటక ప్రద
ర్శనముల కెంతో తోడ్పడిన ఆదర్శ కళారాధకులు

డాక్టరు శ్రీ చంద్రమౌళి సత్యనారాయణరావు గారికి
నా హృదయ పూర్వక నమస్కృతులతో

రచయిత

# తొలి పలుకులు

నేటి సమాజంలో యువతీ యువకులలో ఏర్పడిన అవినీతిని నాకున్న స్వానుభవంతో బాగా తిలకించి, నేనీ నాటకమును 1956 లో పూర్తి జేసితిని. నేను నాటకములను వ్రాయుట ఇదే ప్రథమము అగుట వలన, పాత్రలను ఎలా ప్రవేశ పెట్టాలో, ఎలా వారిని నిష్క్రమింప జేయాలో అర్థముగాక పాత్రలను సంభాషణలను పెంచి వ్రాయగలిగాను. కాని నాకు సంతృప్తి లేదు, ఏదో కొంత కన్పిస్తూనేయుంది, భాష సులభశైలిలో వ్రాయలేక పోయాను. సరిగా ఒకే పోకడతో తేల్చలేక పోయాను. ఈ పరిస్థితులలో నిరాశ జెందక అనేక సమాజాలకు నాటకలో లోపము లుండుటవలన అందరు దీనిని రంగస్థలానికి ఎక్కించడానికి నిరాకరించారు. నేను నిరాశజెంది కొంతకాలము మూలపార వేశాను. ఒకనాడు డా॥ చంద్రమౌళి సత్యనారాయణ గారి ఇంటికిపోయి వారికి యీ నాటకాన్ని చూపెట్టాను. అయితే యీ నాటకాన్ని మా థియేటరు శారదా నాట్యమండలి నాటకాన్ని సరిచేసి ఆడుతామని అన్నారు. అయితే సరే అని అంగీకరించాను. తెనాలి మారీసుపేటలో శ్రీయుతులు మంగమూరి పాండురంగారావు, లింగినేని కృష్ణార్జునరావు, భీమిశెట్టి వెంకటేశ్వరరావు, వాసిరెడ్డి నాగేశ్వరరావుగార్ల సహకారముతో శారదా నాట్యమండలి సభ్యులతో సహకరించి శ్రీ డాక్టరు చంద్రమౌళి సత్యనారాయణరావుగారి ఆధ్వర్యాన యీ నాటకాన్ని జయప్రదముగా పురజనుల కోరికపై ముచ్చటగా మూడు పర్యాయములు ప్రదర్శించి నాకు మంచి కీర్తి తెచ్చి పెట్టిన శ్రీ శారదా నాట్యమండలి ఆర్టిస్టులకు నా ధన్యవాదాలు.

నేను కోరిన వెంటనే ఈ నాటకాన్ని ప్రింటింగు చక్కగా చేయించి మార్కెట్టులో అన్ని సమాజాలకు అందించిన ఆంధ్రరత్న బుక్ డిపో గ్రంధి లక్ష్మయ్య శ్రేష్ఠి గారికి నా ధన్యవాదాలు.

ఇట్లు — రచయిత




రచయిత:

శంకరశెట్టి వెంకట్రావు

C% కమలా ఎలక్ట్రికల్స

పాతఫోర్ టవున్ పోలీస్ స్టేషన్ ప్రక్కన

ఏలూరు రోడ్డు

విజయవాడ - 2.

# నా అభిప్రాయము

మిత్రులు శ్రీ శంకర శెట్టి వెంకట్రావుగారు రచియించిన 'రక్తజ్వాల' అను సాంఘిక నాటకమును ఆమూలాగ్రముగా చదువుటయే గాక తెనాలిలో శ్రీ శారదా నాట్యమండలివారు నేత్రానందముగ ఇచ్చిన మూడు ప్రదర్శనములను తిలకించితిని. మృదుమధురములగు మాటల సొంపు, వీనులవింపు, మనసునకు ఆహ్లాదమును, గగుర్పాటును కలిగించే సన్నివేశాలు, కమ్మని పాటలు, గిలిగింతలుపెట్టు హాస్యము. నవరసాలొలికించు చక్కని నాటకరాజమని చెప్పుట కెంతమాత్రము సందియము లేదు తొలి తనే రచయిత ఇంతటి ప్రతిభావిశేషములు గల 'రక్తజ్వాల' అను యీ నాటకమును వ్రాయగలిగినందులకు నే నెంతయో అభినందిస్తున్నాను. యీ తొలిరచనలోనే ఇంతటి విజయమును గాంచిన యీ విజయుడు మున్ముందు ఇంకా చక్కని నాటకములను రచించి ప్రజా మన్ననలు పొందగలడని, సర్వేశ్వరుడు వీరికి ఆయురారోగ్య సర్వైశ్వర్యములనిచ్చి కాపాడుగాక యని ప్రార్థించు చున్నాడను.

ఇట్లు,
M. D. ప్రసాద్



## —: పరిచయము :—

సురేష్ పాత్రధారి :

చి॥ లింగినేని కృష్ణార్జునరావు

ను

విశాలాంధ్ర

నాటక కళాభిమానులకు,

కళాకారులకు

నా తొలి రచన అయిన "రక్తజ్వాల" నాటకములో కథానాయకుడు 'సురేష్' పాత్రను అతి సమర్ధవంతంగా ఆ పాత్ర అవధుల మేరకు నటించి, ప్రేక్షక మహాశయుల హృదయాలలో కళాకారునిగా శాశ్వత ముద్రను వ్యవస్థాపించుకొనిన చి॥ లింగినేని కృష్ణార్జునరావును ఈ రూపముగ అఖిలాంధ్ర ప్రజానీకానికి, పతి తులకు, కళాకారులకు పరిచయము జేయు భాగ్యము, అవకాశము ఈ నాటక ద్వితీయ ముద్రణ సందర్భమును పురస్కరించుకొని రచయిత నైన నాకు కలిగినందుకు నేనెంతయో గర్వించు చున్నాను.

ఈ యువనటుడు ఈ నాటకమును విజయవాడ రామమోహన గ్రంథాలయములోను, అవనిగడ్డ శ్రీ వెంకటేశ్వర హాలులోను ప్రదర్శించి రచయితగా నాకు బహుళ ప్రచారము గావించి, అనేక పెద్దల ప్రముఖుల ఆదరాభిమానములకు పాత్రుడై యీ పాత్రకు తనకు తానే సాటియని కీర్తింపబడుచున్న యీతడు

నాలోని రచనా పటిమను వెలికి తీసికొనివచ్చి, నాకు ప్రథమ, ద్వితీయ రచనలయిన రక్తజ్వాల, త్యాగశీలలకు తన అమూల్యమైన సలహాలనిచ్చి, తద్వారా నన్ను ఒక రచయితగా నాకు ఒక ప్రముఖ స్థానాన్ని కల్పించాడనటంలో ఏమాత్రం సందేహము లేదు.

అంతే గాక, ఇతడు యీ నాటకమునకు

విజయవాడ — పొన్నూరు

దుగ్గిరాల — చుండూరుపల్లి

కొండముది — క్రొత్తపాలెం

కలెవరం — నందివెలుగు

తదితర పట్టణములలోను, పల్లెపట్టులలోను 'దర్శకత్వ' బాధ్యత వహించి, నాటక విజయమునకు - యింతేల! యీ నాటకము యిప్పటికి కొన్ని వేలుగా ప్రదర్శింప బడుటకు యీతడే ముఖ్యకారకుడైనందున యీతనికి ఆ సర్వేశ్వరుడు సకల ఆయురారోగ్య ఐశ్వర్యములను ప్రసాదించ వలసినదిగా ప్రార్థించుచు

విజయవాడ
4-8-69

రచయిత:
శంకరశెట్టి వెంకట్రావు

ఆర్గనైజరు :



మా శారదా నాట్య మండలికి అహోరాత్రులు కడుశ్రద్ధ వహించి స్వార్థాన్ని వీడి- హృదయపూర్వక ముగా కృషి చేసిన వీరిని భగవం తుడు అనుక్షణం కాపాడుగాక!

శ్రీ గుడిపల్లి సత్యనారాయణగారు

ఆర్గనైజింగు కమిటీ:

ప్రెసిడెంటు : శంకర శెట్టి వెంకట్రావుగారు

శక్రటరి : సముద్రాల నరసింహారావు

ఆర్గనైజరు : గుడిపల్లి సత్యనారాయణగారు

కోశాధికారి : మంగమూరి పాండురంగారావుగారు

రంగాలంకరణ :

M. D. ప్రసాద్

ఆర్కెష్ట్రా :

క్రాప సుబ్బారావు అండ్ పార్టీ

లైటింగ్ అండ్ మైక్ :

ఉదయశంకర ఏజన్సీస్, మెయిన్ రోడ్ - తెనాలి.

మేకప్ :

K. రామారావు - తెనాలి.

నిర్వహణ :

వాశిరెడ్డి నాగేశ్వరరావు

దర్శకత్వం :- డా॥ చంద్రమౌళి సత్యనారాయణరావుగారు

తెనాలిలో శారదా నాట్యమండలి ప్రదర్శించిన ప్రథమ ప్రదర్శనములో

## —: నటించిన పాత్ర ధారులు :—

వెంకట్రామయ్య 60 సం॥
డా॥ చంద్రమౌళి సత్యనారాయణరావుగారు

సురేష్ 25 సం॥ లింగినేని కృష్ణార్జునరావుగారు

సతీష్ 28 సం॥ భీమిశెట్టి వెంకటేశ్వరరావుగారు

రఘు 25 సం॥ డా॥ వి. యన్. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

నారాయణరావు 55 సం॥
ముసుగుమనిషి ,, } షేకు దరియాహుస్సేనుసాహెబ్‌గారు
అప్పన్న. సుబ్బన్న 30 సం॥

రహీం 30 సం॥ యం. సాంబశివరావుగారు

రామయ్య 60 సం॥ కుర్రా వీరయ్యగారు

రంగయ్యశెట్టి 45 సం॥ వాశిరెడ్డి నాగేశ్వరరావుగారు

సత్తిపండు 25 సం॥ యం పాండురంగారావుగారు

ఇన్‌స్పెక్టరు 30 సం॥ యన్. గణేశ్వరరావుగారు

ఇద్దరు పోలీసులు 25 సం॥ టి. వెంకటాచారి,
షేక్ ఖాజావల్లిగార్లు

ప్రభ 20 సం॥ శ్రీమతి తిరుపతికుమారిగారు

ఇందలి పాత్రలు కేవలం కల్పితములేగాని ఎవరిని ఉద్దేశించి వ్రాసినవిగావు.

---

| | | | |
|---|---|---|---|
| మొదటి ప్రదర్శన | 17-7-61 | మారీసుపేట | తెనాలి. |
| రెండవ ,, | 26-9-61 | శ్రీవేణుగోపాల | ,, |
| మూడవ ,, | 7-4-62 | నాగకళామందిరం | ,, |

డైరెక్షన్ :

డాక్టరు చంద్రమౌళి సత్యనారాయణరావుగారు

# రక్తజ్వాల

## [ 1 వ రంగము ]

వెంకట్రామయ్య ఆఫీసు

సమయం - ఉదయం : అది ఒక గది. గదిలోకొన్ని దేశనాయకుల పటాలు, ఒక టేబులు, దానిచుట్టూ కొన్ని కుర్చీలు, ఒక బీరువా, ఒక పొడుగుపాటిబల్ల, టేబులుమీద టెలిఫోను రిసీవరు కొన్ని ఆఫీసు ఫైల్సు, ఆఫీసురూము అనేబోర్డు, నోవేకెన్సీ అనే మరొకబోర్డు. ఒక నౌకరు ఆఫీసుగది శుభ్రపరుస్తూ పాటపాడుతూ ఉంటాడు]

పాట :- "రాజ్యము కరువోయీ, దేశము కరువోయీ
కూడో, కూడని బీదలు మాడుటా?
ఊడుపులలో రాదువాన, కలుపుల్లో రాదువాన
కోతలుకోసేటప్పుడు కొట్టుకుముంచేస్తుంది ॥రాజ్య॥
"బాబూ, ఇంటికిపన్ను, బాబూ పెంటకుపన్ను
సాకిరేవుబల్లకు పన్ను!

మాటలు :- ఇంటికిపన్ను, పెంటకుపన్ను
కడకు, చచ్చినా కాటికిపన్ను,
యిక భార్యా, భర్తలకేమో,
రాబోతుందేమో పన్ను
దేశమంతా పన్నులతో నిండిపోయెరాబాబు
బీదలంతా ఆకలితో మాడిచచ్చెరాబాబు ॥రాజ్య॥

(వెంకట్రామయ్య ప్రవేశము)

(చేతిబెత్తము టేబులుమీదఉంచి, పూజామందిరము వద్దకు వెళ్ళి, భక్తిరంజని పాడుతూ నమస్కరించి హారతియిచ్చి.)

వెంకట్రామయ్య :- అప్పన్నా !

అప్ప :- అయ్యా.

వెంక :- పేపరొచ్చిందా ?

అప్ప :- యివాళ్ళ మేలు లేటనుకుంటానండయ్యా (తెరలో పేపర్, పేపర్) అదుగో బాబూ పేపరొచ్చింది. (బయటికి పోయి పేపరు తెచ్చి టేబులుమీదనుంచి లోనికి వెళ్ళి పోతాడు.)

(వెంకట్రామయ్య పేపరుతీసి)

"కాకినాడ, మే 12 అంతఃపురములో అంతుచిక్కని పరమ రహస్యం లక్ష్మీకాంత నారాయణరావుగారి సతీమణి అకస్మాత్తుగా అంతఃపురమునుండి అంతర్ధానము. పోలీసులు అన్వేషిస్తున్నారు. ఆచూకీ యింకా దొరకలేదు. అనుమానంచేత దాసీ నరసమ్మను అరెస్టు చేయగా ఆమె నారాయణరావు హత్యచేయబడి ఉంటాడని, అతని భార్య వలచిన ప్రియునితో పరారయి ఉంటుందని స్టేటుమెంటు ఇచ్చింది."

అప్ప :- ఆ ! (తెస్తున్న కాఫీగ్లాసు అనుకోకుండా చేతిలోనుండిజారి పోయి క్రిందపడి ముక్కలౌతుంది.)

వెంక :- (ఆశ్చర్యంగా) ఏంజరిగిందప్పన్నా ?

అప్ప :- ఏంలేదు బాబుగారు చేయిజారిపోయింది.

వెంక :- ఊహూ (తలపూపును) బొత్తిగా కాలం మారిపోయిం దోయ్.

అప్ప :- ఔను బాబు, అటువొంటోడి పెళ్ళాం చేయాల్సినతీరిదే నాండి బాబూ.

వెంక :- అందుచేతనే ఎన్నో ఖూనీలూ, కొట్లాటలుగూడా జరుగుతూ ఉంటాయి. నారాయణరావు చాలా మంచివాడు. బాల్య స్నేహితుడు, పాపం.

అప్ప :- (ఉద్రేకంతో) అదే న్నైతే పొడిచేవాణ్ణి బాబూ
(సతీష్ కంగారుగా ప్రవేశిస్తాడు)

సతీ :- నాన్నా...నాన్నా...

వెంక :- (తలపైకెత్తి) సతీష్, యిలా యీ పేపర్లోచూడు. కాకినాడ నారాయణరావుకి జరిగిన అన్యాయం!

సతీ :- వాళ్ళందర్ని గురించి ఆలోచించే సమయంగాదు నాన్నా!

వెంక :- ఏం అలా భయపడుతున్నావు! ఏం జరిగింది?

సతీ :- జరుగలేదు కానీ జరగబోతుంది.

వెంక :- ఏంటది?

సతీ :- సురేష్ కొండను మింగాలన్నంత కోపంగా వస్తున్నాడు.

వెంక :- నా సంసార శాంతి భద్రతలకు భంగం కలిగించిన దుష్టుడు మళ్ళీ వస్తున్నాడా! రానీయ్, వాడి వ్రేళ్ళతోటే వాడి కళ్ళు పొడిపిస్తాను!

సతీ :- ఉద్రేకపడకండి నాన్నా! ఆలోచించకుండా ఆవేశపడితే చివరకు చింతించేది మనమే.

వెంక :- అందుకు?

సతీ :- మీకొక ఆలోచన చెప్తాను లోనికిరండి?

(యిద్దరు నిష్క్రమించెదరు)

అప్ప :- టేబులుమీద పేపరు తీసి, నిట్టూర్పుతో) నారాయణ రావు హత్య చేయబడ్డాడని, దాసీ నరసమ్మ స్టేటు మెంటా? (స్వగతం) ఎంత విశ్వాసపాత్రురాలవునరసమ్మా (కోపంతో) నా సంసారంలో చిచ్చుబెట్టిన ఆ కిరాతకుణ్ణి, ...ఆకిరాతకుణ్ణి. నాశనం చేసేవరకు. యీ మారు వేషం లోనే మగ్గుతూ, నా సమీపానికే వస్తున్న ఆగంతకుణ్ణి అంత మొందించే వరకు నా దీక్ష విడువను (గట్టిగ) నా దీక్ష విడువను

(సురేష్ ప్రవేశం)

సురేష్ : (జేబులో పిస్టలు, చేతిలో హేండ్ స్టిక్, నోటిలో స్టైలుగా సిగరెట్, చేతిలో సిగరెట్ టిన్, అగ్గిపెట్టె, ఫుల్ సూట్ లో ప్రవేశిస్తాడు. అప్పటికే అంటించని సిగరెట్ నోటిలో వుంటుంది. తలవని తలంపుగా సిగరెట్ వెలిగించి ఒకదమ్ములాగి నలువైపులా పరిశీలిస్తాడు. విషాదంతో ఉన్న అప్పన్నను చూసి)

సురే: ఎవరక్కడ ?

అప్ప: (వంగినమస్కరిస్తూ) నేనండయ్యా,

సురే: ఆయనెక్కడ ?

అప్ప:- మేడమీద సతీష్ బాబుగారితో మాట్లాడుతున్నారు.

సురే: తక్షణం, పిలువ్ ?

అప్ప: చిత్తం. పెదబాబుగారూ, పెదబాబుగారూ, (అంటూ లోనికి పోవును)

సురే: (సురేష్ సిగిరెట్ కాలుస్తూ వెంకట్రామయ్య రాకకోసం నిరీక్షిస్తుంటాడు. వెంకట్రామయ్య కండ్లజోడు సవరించుకొంటూ ప్రవేశించి, సురేష్‌ని చూడనట్లుగా నటిస్తూ ఆఫీసు పనిలో నిమగ్నుడైనట్లు కన్పిస్తాడు. సురేష్ వళ్ళు మండిపోతుంది, తమాయించుకొని, ఎదురుగా కన్పించే కుర్చీ లాక్కొని కూర్చుంటాడు. వెంకట్రామయ్య తలయెత్తి చూచి పలకకుండా, మళ్ళీ తలదించుకుంటాడు.)

సురే: నాన్నా! ... నాన్నా!

వెంక: (వెంకట్రామయ్య పలకడు, తలఎత్తిగూడా చూడడు.)

సురే: (గంభీరంగా) నాన్న!

వెంక: (ప్రశాంతంగా తలయెత్తిచూసి) ఏం? ఎందుకొచ్చావ్ ?

సురే: (వ్యంగ్యంగా) తమ దర్శనం కోసం

వెంక: (కుర్చీలోనుండి లేచి) అయిందిగా ఇకనడువ్ ?

సురే : కారణం?

వెంక : కారణమా! కండ్లకావరంతో కన్నుమిన్నుగానక, యిల్లు విడిచిపెట్టిళ్ళిన వాడివి మళ్ళి ఏ ముఖం పెట్టుకొని నాగుమ్మంత్రొక్కావ్ ? సిగ్గులేదు ? ముందు బయటకు నడు ?

సురే : నాన్నా! (కోపంగా) ఆలోచించి మాటాడండి.

వెంక : లేకపోతే ?

సురే : ఏంజరుగుతుందో చెప్పలేను!

వెంక : నా ముందరట్రా నీ ప్రతాపాలు ? ఎవరి ఎదుటనిల్చి మాట్లాడుతున్నావో తెల్సా ?

సురే : తెల్సు బాగా తెల్సు, కన్నకుమారుణ్ణి యింటినుండి తరము తున్న ఒక కఠినాత్మునితో

వెంక : నోరుముయ్ !

సురే : మీ పరిసరప్రాంతాలకు వచ్చానన్న అలుసును ఆధారంగా తీసుకొని నన్నింత చులకనగా చూడటం మంచిదిగాదు.

వెంక : నీకసలు మంచిదంటూ ఒకటుందని తెలసట్రా!

సురే : తెలుసు!

వెంక :_ తెలుసుంటే తరతరాలుగా వస్తున్న నా వంశ ప్రతిష్టలకు, తీరని తలవంపును తెచ్చిపెడతావా ? నువ్వు నాకు పుత్రుడవా ? కాదు...కాదు...శత్రుడవు పుట్టగానే ఎందుకు గొంతు పిసిగి చంపలేదా అనివిచారిస్తున్నానురా? నీ తల్లితో

బాతే నువ్వూ చచ్చావనుకుంటాను! నేనే ఒక బాధ్యత గల్గిన పోలీసు అధికారినై ఉంటే నిన్ను నడిరోడ్డుమీద చిత్రవధ చేయించి ఉండేవాణ్ణిరా!

సురే : (కోపంగా) నాన్నా!

వెంక : ముయ్యరానోరు, నీముఖం నాకు చూపించకు, పో బయటకు ?

సురే : (జాలిగా) నాన్న

వెంక : నాన్నట, నాన్న. నీనోటినుండి ఆ పవిత్ర పదాన్ని ఉచ్చరించడానికి గూడా అర్హుడవుగావు.

సురే : అయితే నేను మీ కుమారుణ్ని గానంటారు ?

వెంక : కావు,...ముమ్మాటికి కావు. అన్నకొడుకైనా కన్నకొడుకైనా ఆ సతీష్ ఒక్కడేరా!

సురే : వాడా ?

వెంక : ఔను వాడే ఈ నాడు యీ యింటికి సర్వాధికారివాడే.

సురే : శభాబాష్ నాన్నా. కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది. నాన్నా, మీ వయస్సులో బాటే మీ మేధస్సు గూడా ముదిమిబారిందా? అరచేతి పెట్టుకొని అల్లారు ముద్దుగా పెంచిన సురేష్ గాడావీడు ? వంశోద్ధారకుడని మీ కులానికి మణిపూసనని మాటలకు వజ్రాలగనినని ముద్దుపెట్టుకున్న ఆనోరేనా యీ నాడు కాదంటుంది ?

సూర్యచంద్రులైతే గతులు తప్పరు కానీ మీ లాంటి సామాన్యమానవులు మాటదప్పడం ఒక లెక్కా ?

వెంక : అందుకు నీ ప్రవర్తనే కారణం, ఈనాడు నాకు నీకు ఏవిధమయిన సంబంధం లేదు.

సురే : లేదా ?

వెంక : లేదు.

సురే : అదే నిజమయితే, (జేబులోనుంచితీసి) యిదిగో

వెంక : ఏంటది !

సురే : దఖలు దస్తావేజు

వెంక : ఏం చేయమంటావు ?

సురే : ఒక చిన్న సంతకం చేయమంటాను.

వెంక : సంతకమా !

సురే : ఔను ! మీ ఆస్తిలో భాగం నాకు రావాలని

వెంక : అదా సంగతి

సురే : ఔను.

వెంక : అయితే అదెప్పుడో సతీష్ కే వ్రాసేశాను.

సురే : ఆఁ ?

వెంక : ఔను, కావాలంటే వాణ్ణే ప్రాధేయపడు ?

సురే : పొట్టకూటికై మీ అండజేరి మీ అడుగులకు మడుగు లొత్తే ఒక్క అధమున్ని నేను ప్రాధేయపడాలా? మర్యాదగా సంతకం చేయండి :

వెంక : సంతకం (హ హ హ) చేయాలి! (హ హ హ) (చించి వేసి) యిదిగో చేశాను ? యిక బయటకు నడవ్ (అంటూ కాంపలు వాయించి, చింపిన దస్తావేజు ముక్కలను ముఖము మీదకు విసరి కొట్టును.)

సురే : అయ్! ఒక్క ముసలి పీనుగకు యింత కండ కావరమా ? (అంటూ కోపంతో మీదకు పోవును.)

(సతీష్ ప్రవేశం)

సతీ : తమ్ముడూ! ఆగు! (తండ్రి మీదకు పోబోతున్న సురేష్‌ని ఆపుతాడు)

సురే : యు గెటవుట్ (ఒక్క త్రోపు త్రోయును, సతీష్ క్రింద పడును నెమ్మదిగా లేస్తూ ఉండగా)

వెంక : సురేష్! ఛండాలుడా, నీ ప్రవర్తన మరీ హద్దులు దాటి పోయిందిరా.

సురే : (హాహాహ) అలాగా!

సతీ : మీరూ ఆవేశపడితే ఎలానాన్న! తమ్ముడు ఏనాటికయినా కన తప్పును, తాను తెలుసుకొని మనదారికి రాక తప్పదు.

వేంక : నీ మమకారము వల్లనే వీడిలా తయారయ్యాడు.

సతీ : ఎందుకొచ్చిన మాటలు నాన్నా! దౌర్జన్యముగా తమ్ముడిలో పరివర్తన తేగలమా! తమ్ముడూ, నీకు కావలసింది ఆస్తేగా?

(సురేష్ వైపుతిరిగి)

సురే: ఔను, కాని, అది నీ పేర ఉందిగా!

సతీ : పాతపాటు పడుతున్నావు తమ్ముడూ, నువ్వొకటి నేనొకటేనా!

సురే : అనే యింతవరకూ జరిగింది.

సతీ : ఏమీ జరుగలేదు! నాన్నగారు పంచి యీయకపోతె, నేను పంచి యిస్తాను!

సురే : నీ ముష్టి చేతులతో నా కాస్తి పంచుతావా? తప్పుకో అడ్డు!

సతీ : అపార్థం చేసుకొని, కయ్యానికి కాలు దువ్వుతున్నావా?

సురే : కయ్యానికి కాలు దువ్వడమే కాదు, కత్తితో సాము గూడా చేయవలసి వస్తుంది!

సతీ : అంతవరకెందుకు? అన్నదమ్ములమధ్య ఆవేశం పెల్లుబికి, ఫెళ ఫెళార్భాటాలతో పోరుసల్పాలా? (అంటూ చేతులు పట్టుకుంటాడు.)

సురే : (చేతులు విడిపించుకొని) యురాస్కెల్, బ్లడీబెగ్గర్ (త్రోసివేయును.)

వెంక : సురేష్...ఎంతపని చేశావురా, సతీష్ యిలా వచ్చేయి నాయినా!

సతీ : పర్వాలేదు నాన్నా! తమ్ముణ్ణి ప్రస్తుత వాతావరణం అలా మార్చి ఉంటుంది!

వెంక : ఈ నాడు నాకళ్ళముందు ఎటువంటి ఘోరకృత్యాలు చూడ వలసి వచ్చింది. వీడు మనిషిగాడు. నరరూప రాక్షసుడు.

సతీ : మీరు ఆ వేశంలో తమ్ముణ్ణి అంతంత మాటలవడం సహించ లేను నాన్నా, శాంతించండి!

వెంక : శాంతి! నా జీవితానికి అదొక్కటే తక్కువ, జీవితంలో మృత్యువుకు ముందు విశ్రాంతి ప్రళయానికి ముందు ప్రశాంతం తప్పవు కాని, నా జీవితానికి (ఏడుస్తూ)

సతి : నాన్నా...మీ మీద పిడుగుపడ్డట్టు అదిరిపోకండి. ఈ సమయంలో నిరాశ, నిస్పృహ తగదు.

సురే : (హ హ హ) ఒకరి ముఖంలో భయం మరొకరి ముఖంలో ఆందోళన, నా ముఖంలో నిరాశ నిముషనిముషానికి రూపాలు మారుతున్నా పట్టుదలలు మారవు కాబట్టి మర్యాదగా ఇనప్పెట్టె తాళాలివ్వండి!

వెంక : నా దగ్గర లేవు!

సురే : మరెక్కడున్నాయి?

వెంక : నాకు తెలియదు

సురే: తెలియదా ? (కోపంగా మీదకు పోబోవును.)

సతి : సురేష్ ఎంతపని చేస్తున్నావురా ? భగవంతుడు గూడా నిన్ను క్షమించడు.

సురే : భగవంతుడా ? వాడేవుంటే నాకీ అన్యాయమే జరిగి వుండేది గాదు !

సతి : అలా మంచిగా అడిగితే ఎవరు కాదన్నారు !

సురే : స్వార్థపరుడా, నువ్వు మాట్లాడుతూ వుంటే అరికాలి మంట నెత్తికెక్కుతుంది !

సతి : తమ్ముడూ స్వార్థభావంతో గాని అధికార వాంఛతో గాని నేనేమి ప్రవర్తించడము లేదురా !

సురే : నోరుముయ్

వెంక : అందరిని తిరస్కరించి నువ్వేమై పోవాలనిరా ?

సురే : ఆస్తికి వారసుణ్ణి కావాలని !

వెంక : అందుకని యింటబడి దౌర్జన్యంగా కొల్లగొట్టుకొని పోవాలని చూస్తున్నావా ?

సురే : సాత్వికంగా ప్రాధేయపడితే చిల్లిగవ్వయినా లేదన్నారుగా !

వెంక : అన్నామురా, అన్నాను, నీ అంతేంటో తేల్చుకుంటాను, పట్టపగలు నా సమక్షములో దోపిడీ చేస్తావా ! (టెలిఫోను వద్దకు వచ్చి) హల్లో, హల్లో, పోలీస్ స్టేషన్

సతి : నాన్నగారూ, నాన్నగారు, ఆపండీ మీ ప్రయత్నం.

వెంక: సతీష్, నా ప్రయత్నానికి అడ్డురాకు ?

సతి : నాన్నా !

వెంక : నీకే, చెబుతుంది ... హల్లో, నేను వెంకట్రామయ్యను జయలక్ష్మి రైస్ మిల్ ప్రొప్రయిటరిని.

సతి : (కోపంగా) నాన్నా ! (రిసీవరు లాక్కొని) హల్లో, హల్లో, ...ఆ...ఆ...మిష్టర్ సబ్ ఇన్ స్పెక్టర్, ప్లీస్ రాంగ్ కాల్, ఎక్స్ క్యూజ్ మి! ...ఎస్ ... ఎస్ ... (టెలిఫోను పెట్టేసి) సామాన్యముగా పోయే చిన్న విషయాన్ని, కొండంతగా చేసుకొని, బ్రతుకు బండలపాలు చేసుకుంటామా నాన్న !

సురే : (హహహ) హు ... ఆపారేం, మీ రిపోర్టు మాట్లాడండి, పోలీసులు వచ్చేలోగా నేనూ నా పనిని పూర్తి చేస్తా. (జేబులోనుండి పిస్టలు దీయును) వెంకట్రామయ్యా, సతీషు స్తంభించి పోవుదురు.)

సతి : తమ్ముడూ ఏమిట్రా ఈ యఘాయిత్యం !

సురే : (హ హ హ) అఘాయిత్యంగాదు పైత్యం. (పిస్టలు పైకి పేల్చి) యిక్కడనుండి ఎవరైనా కదలడానికి ప్రయత్నించారో (వారిరువురకు ఎదురుగా పోవును.) (పిస్టలు వెంకట్రామయ్య గుండెలమీద నుంచి) వెంకట్రామయ్యా నీకు ఐదు నిముషములు వ్యవధినిస్తున్నాను! ఆలోచించుకో! (అంటూ వాచి చూస్తూ) తాళాలెక్కడున్నాయో చెప్పు ! (వాయిద్యాలు భీకరంగా మ్రోగుతుంటాయి)

వెంక : ఒరేయ్ ! వెధవాయ్, నీవు పిస్టలు చూపించినంత మాత్రాన బెదరి, తాళాలు సంగతి చెపుతాననుకున్నావా! నా శరీరములో కడపటి నెత్తుటి బిందువున్నంతవరకు, తాళాలే గాదు, కనీసం పూచికపుల్లయినా నీకు దక్క నీయనురా ! ఊ కాల్చరా, కాల్చు, (అంటూ చొక్కా గుండీలు దీసి ఎదురుగా పోవును. సతీష్ ఆపటానికి ప్రయత్నిస్తాడు.)

సతి : తమ్ముడూ, యిది నీకు ధర్మముగాదు ఎంతయినా కన్న తండ్రిరా, కండ్లుమూసుకొని ప్రవర్తిస్తున్నావా ?

సురే : షటప్ యు గెటవుట్

సతి : ఆవేశములో చేయబోతున్న కార్యక్రమమేంటో ఆలోచించకుండా చేస్తే జీవితాంతము నీ ఆత్మకు శాంతి ఉండదురా !

సురే : ఈ సమయంలో నీవేంచెప్పినా నాకర్థముకాదు. వెళ్ళు, ప్రాణాలమీద ఆశవుంటే దూరంగా పొండి. ఎవరూ ముందుకు రావడానికి ప్రయత్నించవద్దు. ఇప్పటికయినా మించి పోయిందిలేదు. మర్యాదగా గుట్టుచప్పుడు గాకుండా తాళాలివ్వండి. ఉన్నదిక నాల్గు నిమిషాలే (గడియారం వంక చూస్తూ వుంటాడు)

సతి : ఏమిట్రా యిదంతా నీపట్టేసిదిగాని, రానురాను సంసార కూటం రణకూటంగా మారుస్తున్నావా ? (అంటూ ఎదురుగా పోవును)

సురే : స్టాప్ దేర్, పిస్టలుకు ఎదురు రావడానికి ప్రయత్నించకు !

సతి : వస్తాను. జరుగుతున్న యీ అత్యాచారాన్ని ఎదుర్కొంటాను ! పోతే నా ఒక్కడి ప్రాణాలే పోతాయి, అంతటితోనైనా మన సంసారము చక్కబడుతుంది. నీవెందుకింతగా పతనమై పోతున్నావో నాకంతా తెలుసు. నిన్ని నీచ కార్యాలకు ప్రోద్బలం చేసిన భ్రష్టుడెవడో కూడా నాకు తెలుసు. యీ దుష్ట కార్యాలకు ప్రోద్బలము చేసిన నీ మిత్రులే నీకు శత్రువులౌతారు. నిన్ను ఏ మంత్రాల మత్తుక్రిందో నిలబెట్టి అర్ధము లేని సిద్ధాంతాలను నూరిపోసిన వాణ్ణి యిప్పుడే నాశనం చేస్తా.

సురే : ఆగు, కదలకు ! ఊఁ వెంకట్రామయ్యా ? యిచ్చిన గడువు దాటిపోతూవుంది ?

సతి : చేసిందానికి పశ్చాత్తాప పడవలసి ఉంటుందిరా ! నీ నిర్ణయం మార్చుకో.

సురే : ప్రళయం వచ్చినా నా నిర్ణయం మాత్రం మారదు. ఒక్క నిముష మే వ్యవధి ఉంది. (వాచీ చూస్తూ ఉంటాడు. ఆందోళనగా వాయిద్యాలు మారు మోగుతుంటాయి.) ఊ !..... టయిమయింది, ఇక మీ ఆఖరి జవాబు_

వెంక : చెబుతా విను, కన్న నేరానికి ఎన్ని చేసినా ఓర్చాను, నన్ను యీ వృధాప్యములో కూడా ఎంత క్షోభ పెడుతున్నావో కూడా తెలుసు నేనే రోషము గలవాడినయి

తే నీలాంటి కుటిల హృదయునను ఒక్కరానీ గూడ దక్కనీయను. అప్పన్నా!

అప్ప : బాబయ్యా (లోపలికినుండి వచ్చును.)

వెంక : బయటకు గెంటరావాణ్ణి?

అప్ప : చిత్తం (సురేష్‌కి ఎదురుగా పోబోవును.)

సురే : ఖబడ్ దార్ అప్పన్నా, ఒక్క ఆడుగుముందుకు వేశావా కాల్చేస్తాను, రెడీ-వన్-టు (త్రీ అనబోతుండగా)

(రామయ్య ప్రవేశం)

రామ : ఆగు! సురేష్ బాబు!

సురే : ఓహో గుమస్తా రామయ్యగారా!

రామ : ఔను. ఈ తాళాల కోసమేగదా. యింత కల్లోలానికి పూనుకుంది!

సురే : ఏం, నీకు తలతిరుగుతోందా?

రామ : నన్నేమన్నా నాకు బాధలేదు. తుచ్ఛమగు డబ్బుకోసం కన్నతండ్రిని హత్యజేస్తారా! వినాశకాలే విపరీత బుద్ధిః.

సురే : ఏమన్నావురా, బ్రూట్ (చెంపకాయ కొట్టును.)

వెంక : (కోపంగా) సురేషు

రామ : సురేషుబాబు! మీరు కొట్టింది నన్నుగాదు, న్యాయాన్ని, నీ తల్లి పోయినాటికి ఆరునెలల పసివాడివి, పసిగుడ్డుగా ఉన్న మిమ్మల్ని యీభుజాలపైనే ఎత్తుకుని ఆడించినందుకు

నాకీ ప్రతిఫలం జరుగవలసిందే, మీకు కావలసినది తాళా లేగా, ఇవిగో (ఇచ్చును)

సురే : మెనీ మెనీ థాంక్సు ముసలిరామయ్యా (అంటూ తెర లోనికి పోతాడు)

వెంక : రామయ్యా (గట్టిగా) ఎంతపనిచేశావు రామయ్యా!

రామ : అందుకు మీ రేశిక్ష విధించినా సిద్ధంగా ఉన్నాను.

సతీ : రామయ్యగారు చేసినదానిలో పొరబాటేలేదు నాన్నాగారు

వెంక : ఒకరిపొరపాటేంటి అంతా నా గ్రహపాటు.

రామ : ఒక్కమాట మాత్రం నిజం బాబుగారు ! నేనే ఈనాడు ఈ సాహసం చేసియుండకపోతే సంసారమంతా సర్వనాశన మయి, రెండు మూడు హత్యలతో రక్తపాతము గూడా జరిగి యుండేదేమో, నా కర్తవ్యాన్ని నేను నిర్వర్తించు కున్నాను, సెలవు, వస్తా

సతీ : రామయ్యగారూ...రామయ్యగారూ! నాన్నా, రామయ్య గారు వెళ్ళిపోతున్నారు నాన్నా.

వెంక : రామయ్యా...రామయ్యా...

రామ : (పలకడు నిష్క్రమిస్తాడు)

సురే : (లోపలనుండి వచ్చి) గుడ్ బై మైడ్యిరు ఫాదర్ (నిష్క్రమించును) [తెర వ్రాలును]

# రక్తజ్వాల

## (2వ రంగము)

సమయం : రాత్రి

(ఆదొక పెద్దగది. గదిలో రెండు సోఫాలు, ఒక నిలువుటద్దం, ఒక దువ్వెన, ఒక టెలిఫోను, ఒక రేడియో, ఒక టేబుల్‌లైట్, మరి కొన్ని సినితారల చిత్రాలు, ఒక టేబుల్‌ఫ్యాన్, స్నో సీసా, లిప్‌టిక్, పౌడర్ టిన్, హేండ్‌బేగ్, టేబుల్ మీద సురేష్ ఫొటో ఉంటాయి.)

ప్రభ : (ప్రభ తలదువ్వడం ముగించి, టేబులుమీద కన్పిస్తున్న సురేష్ ఫొటో చేతిలోనికి తీసుకొని, పాటపాడుతుంది.)

పాట: (నాగిన్ చిత్రములో ఊంచీ ఊంచీ దునియా కీ దీవారెసయ్యా)

పోంచీ, పోంచీ పిలిచావె, నీకు న్యాయం కాదోయ్
జాబిలీ, ఓ జాబిలీ, నేరానులే
ననూ జూచి నవ్వాకోయి జాబిలీ నేరానులే
ననూ జూచి నవ్వాకోయి జాబిలీ, నే రానులే ॥పోంచీ॥
చాలునయా, యిక చాలునయా
మది తలచినవాడే దొరికెనయా
ఎందెందు వెదకినా. అందాలరాజును
మించినవాడు మది, లేడుగా మరి లేడుగా నే రానులే,
ననూ జూచి నవ్వాకోయి జాబిలీ నే రానులే ॥పోంచీ॥
రాగములో అనురాగము గలిపి
వలపులతో తన తలపులతో
నవ్వుతాడు నవ్విస్తాడు

కవ్వించి మురిపిస్తాడు
నీకంటె వలపులరాజు
దొరికేనోయి నాకు దొరికేనోయీ
నన్నూ జూచి నవ్వావోయి జాబిలీ నే రానులే ॥పాంచీ॥

(వెంకట్రామయ్య ప్రవేశము)

వెంక : (చేతిలో బెత్తం, సన్నని లాల్చీ, దానిపై కోటు, భుజం మీద జరీఅంచు కండువా. కోటులో గడియారము, గొలుసు కనబడుతూ ఉంటుంది, గడము మూసి ఉంటుంది. సన్న గ్లాసుకో పంచె బిళ్ళగోచితో కట్టి, కాళ్ళకు బూట్లు ఉంటాయి కళ్ళజోడు ఉంటుంది.) (బయటనుండి) ఎవరూ యింట్లో !

ప్రభ : (పాటలో లీనమయిన ప్రభ పాటనాపి) ఎవరూ ! లోపలకు రండి

వెంక (కుర్చీలో కూర్చుని) సురేషెక్కడ ?

ప్రభ : ఎక్కడికి వెళ్ళారో తెలియదు !

వెంక : ఎప్పుడొస్తాడు ?

ప్రభ : చెప్పలేను !

వెంక : (వెళ్ళబోతుంటాడు)

ప్రభ : వస్తే, ఏంచెప్పమంటారు ?

వెంక : (వెళ్ళుతున్నవాడు ఆగి, ప్రభ ముఖం చూచి, నిట్టూర్పు విడిచి) ఏమీ చెప్పనక్కరలేదు. (వెళ్ళబోతుంటాడు.)

ప్రభ : మీ పేరు ?

వెంక : (తిరిగివచ్చి) పేరు ... హు (విట్టూర్పుతో) పేరుతో పనేముందిలే

ప్రభ : ఏకో చెప్పటానికి సందేహిస్తున్నారే! నేను వారి భార్యను.

వెంక : ఆ, నీవేనా ప్రభా దేవంటే

ప్రభ : ఔను

వెంక : అయితే నీ వలన నాకు ఒక ఉపకారం కావాలి.

ప్రభ : మీరు చాల వింతమనుష్యులు లాగున్నారే! మీలాంటి పెద్దవారికి మాలాంటి అల్పులు - అందులో అబలను - నేను చేయదగిన సహాయము ఏముంటుంది.

వెంక : అలాకాదు. విశాల దృక్పథంతో ఎదుటివారి జీవితాల లోకి తొంగిచూచి, ఆ వేదనతో అణగారిపోతున్న బ్రతుకు లకు ప్రశాంతిని ప్రసాదించి, తమ త్యాగాన్ని ప్రకటించు కున్న అబలలు ఎందరో వున్నారు.

ప్రభ : మీరు పూర్తిగా పూర్వకాలపు మనుష్యులు లాగున్నారే? ఇంతకు నేను చేయగలిగిన పనేంటో చెప్పండి, చేతనైతే తప్పకుండా చేస్తాను!

వెంక : మాట తప్పవు గదా!

ప్రభ : ఆడి తప్పే వ్యక్తిని గాను.

వెంక : బాగా ఆలోచించి నిర్ణయించుకో!

ప్రభ : ఆలోచించవలసిన పని లేదు. నా ప్రత్యక్షదైవం, నా సురేష్ మీద ప్రమాణం చేసి చెపుతున్నాను. తప్పండి సందేహించకండి

వెంక : ఏ సురేష్ మీదైతే ప్రమాణం చేశావో, ఆ సురేష్ శ్రేయస్సుకోరి యీ రోజునుంచి, యీ ఛాయలకు గూడా రాకుండా చేయాలి !

ప్రభ : ఆపండి ! ఇదేనా మీరు కోరే సాయం, ఆ మాటనడానికి మీకు నోరెలా వచ్చింది.

వెంక : పిచ్చిదానా, (విషపునవ్వు) యీ మాత్రము దానికేనా సురేష్‌మీద ఎంతో ప్రేమ వున్నట్లు ప్రమాణం చేశావు. నిజంగా నీకు సురేష్‌మీద ఎంత ప్రేముందో యీ ఒక్క విషయంలోనే అర్థం చేసుకోవచ్చు.

ప్రభ : సంతోషం, ఆయన్ని కన్నతండ్రి లాగ, వెనుక వేసుకొస్తున్నారే !

వెంక : అందుకే యింత బాధ పడుతున్నాను.

ప్రభ : ఆ...అయితే మీరు...

వెంక : కన్నతండ్రిని కనుకనే అంతస్తును విడిచి అర్థిస్తున్నాను. ఈ ఒక్క విషయం చేయి. మా సురేష్‌ని మాకు దక్కించు, ఆ వేదనతో అలమటించిపోతున్న యీ ముసలి తండ్రికి పుత్ర భిక్ష పెట్టమని వేడుకుంటున్నాను.

ప్రభ : క్షమించండి, యీ ఒక్క విషయము మిమ్మల్ని తిరస్కరించి నందుకు నన్ను మన్నించండి, ఇది తప్ప మరే విష

యము కోరినా తప్పక పాటిస్తాను. కాని సురేష్ ఎడబాటుతో నేను జీవించలేను. అతను లేని నా బ్రతుకు శూన్యం.

వెంక : జీవించలేవా! మధ్యలో వచ్చిన నీకే వాడిని దూరం చేసుకోటానికి అంత కష్టంగా ఉంటే, కనీ, పెంచి, పెద్ద చేసి వాడి మీద ఎన్నో ఆశలు పెట్టుకున్న నా హృదయం ఎంతగా బాధపడుతోందో గ్రహించావా? నా సురేష్‌ని నాకు దక్కించు, యిదిగో యీ ఐదువేల రూపాయలు తీసుకొని తక్షణం యీ వూరు విడిచి వెళ్ళిపో.

ప్రభ : ఛీ, ఈ పాపిష్టి డబ్బుకోసం మనసిచ్చిన మగవాడికి దూరమవ్వాలా?

వెంక : మనసిచ్చింది నువ్వా వాడికా? నీ జీవితంలో నువ్వు మనసిచ్చిన వారిలో నువ్వా వాడు ఎన్నో వాడు?

ప్రభ : (కోపంగా) ఆపండి! అంత నీచానికి పడిగట్టుకోటానికి నేనేమన్నా వేశ్యననుకున్నారా? నేను అతన్ని పవిత్రముగా ప్రేమిస్తున్నాను.

వెంక : ఏమి ప్రేమ, ఏమి అనురాగము, ఏమి అభినయం! పెద్ద తాళికట్టిన పెళ్ళాములాగ ఎంత నీవాడదానివైనా నీకంత అహంకారమా! తిరుగుబోతుల అనురాగం పాతివ్రత్యం నాకు బాగా తెలుసు.

ప్రభ : ఏమిటి మీకు తెలిసింది? ఆడదానికన్న అలుసు కొద్ది నోరు పారవేసుకుంటమా? మీ రనుకున్నంత పేదదాన్ని

కాదు నీలాన్ని బజారులో విచ్చలవిడిగా అమ్ముకుంటానికి ?

వెంక : కాబట్టే కాబోలు సురేష్‌ని యీ దుస్థితికి తీసుకొని వచ్చావ్.

ప్రభ : ఆయన వలన నాకే స్వార్థము లేదు.

వెంక : నీకే స్వార్థం లేకపోతే, నీవింత సాహసానికి దిగేదానివే గాదు. ఏమైనా సురేషును నీవు విడిచి పెట్టాల్సిందే.

ప్రభ : అసంభవం !

వెంక : ఏంటా తలబిరుసు ?

ప్రభ : పెద్దలు మీరేమన్నా సహిస్తాను, కాని మీకిది ధర్మంగాదు.

వెంక : ధర్మాధర్మాలు యోచించే సమయం గాదిది ! మానవత్వం మనస్తత్వం గలదానివైతే తక్షణం వెళ్ళిపో, లేదా నీకు నిలవనీడగూడా లేకుండా చేయగలను ఊ...త్వరగా నీ మూట ముల్లె సర్దుకో యింకా ఉపేక్ష చేసి నామాట కాదంటె ...

(సురేషు ప్రవేశము చేతిలో ఒక నగలుపెట్టె ఒకటి ఉంటుంది)

సురే : శాల్తీ కల్లంతో తుందంటూకు. అంత్తేనా నాన్నగారూ !

(అంటూ ప్రభాదేవిని అప్యాయంగా కౌగలించుకుంటాడు)

వెంక : శివశివా (చెవులు మూసుకొని) ఎంత మదమురా నీకు ? నా ఎదుట నీకు ఒక కులటతో సాంగత్యమా ?

సురే : ఉడుకు రక్తం నాన్నా

ప్రభ : చూశావా సురేష్ ! నేను కలటనంట ! నువ్వు ఎదురుగా ఉండి అనిపించే మాటలివేనా ! పౌరుషం లేదూ ?

సురే : నాన్నగారూ, నా ఎదుట నా ప్రియురాల్ని పరిహాసిస్తే అమర్యాదగా బయటకు గెంటించాల్సొస్తుంది.

వెంక : గెంటిస్తావురా గెంటిస్తావు! తెలుసుకో నన్నవమానించిన దాని ప్రతిఫలం తొందరలోనే అనుభవిస్తావు.

సురే : సరా ! ఇక వెళ్ళండి, మీతో సావధానంగా మాట్లాడడానికి నాకు తీరికలేదు. కమిన్ డార్లింగ్, వస్తా ... చీరియో !

వెంక : అగు (విచారంగా) యీ డార్లింగులు యీ ఫ్రండ్సు శాశ్వత మనుకున్నావు గాని, నీకన్నతండ్రి హృదయం ఎంతపరితపించు తుందో గమనించావా ? ఇలా మారుతావని కలలో గూడా అనుకోలేదు. ఒక్కగా నొక్క కొడుకువని ఎన్నో ఆశలు పెట్టుకున్న నీ తల్లికి ఆమె మరణావస్థలో, నే నిచ్చిన వాగ్దానం ప్రకారం నువ్వేం చేసినా సహిస్తూ వచ్చాను. కాని నా అనంతరము నీ జీవితం ఎలా మారుతుందో ఆలోచించుకో, మంచానపడి చావుకి సిద్ధంగా ఉండి రమ్మని కబురుచేస్తే ఖాతరుచేయ లేదుగదూ

ప్రభ : అబ్బాగండి ! ఈ పాడు పీడ విరగడయ్యేటట్లు లేదు.

వెంక : నోరుమూయవే వంచకి.

ప్రభ : చూశావా సురేష్! ఎంత నీచంగా మాట్లాడుతున్నారో?

సురే : (కోపంగా) నాన్నా

వెంక : నోరుముయ్యరా వెధవాయ్.

సురే : షటప్, (తిరిగికొట్టి) ఇక బయటకు నడు.

వెంక : సురేష్, ఎంతపని చేశావురా? చేజేతులా నీకు వప్ప గించాలనుకున్న అమృతభాండాన్ని విషాగ్నికుండ అని తలంచి, ఈ సదవకాశాన్ని జారవిడుచుకున్నావు కన్న తండ్రిని చెయ్యి చేసుకున్న దానికి ఫలితం జీవితాంతం నీ ఆత్మకు శాంతి దొరకనీయదు. సురేష్, ఇదే నా తుది చూపు. కనీసం నీకు కళ్ళ చూపులుగూడా దొరకవేమొ... వస్తా...(ఏడుస్తూ వెళ్ళిపోబోతాడు)

సురే : అది మామూలువారమే, దయ చేయండి స్వామీ! ఇటూ దారి. (దారిచూపును) ఇదిగో మీ చేతికర్ర (వెంకట్రా మయ్య విచారంగా నిష్క్రమించును.)

ప్రభ : హియర్ హియర్ ఎక్సలెంట్ అండ్ మార్వలెస్ (చప్పట్లు కొడుతుంది) ముచ్చటగా మూడు మాటలతో ములుకుల్లాగ గుచ్చి పంపించావు. కానీ, మనకేమైనా కీడు తలపెడుతారేమో!

సురే : వెడ్చాడు, నేను నీ ప్రక్కనున్నంతకాలము హరి హరా దులు గూడా నిన్నావంత చేయలేరు. ఇదిగో నీ బర్తుడే గ్రీటింగ్సు

ప్రభ : ఏంటవి ? (చేతిలో పెట్టె లాక్కోబోతుంది.)

సురే : ఆగాగు ఏంటో చెప్పుకోచూద్దాం

ప్రభ : గాజులు

సురే : నో

ప్రభ : చంద్రహారమా ?

సురే : నో...నో...ఆ వేంగావు ఓడిపోయానని ఒప్పుకుంటే ...

ప్రభ : అబ్బబ్బ వేధించక చెబుదూ ఓడిపోయాను లే.

సురే : అయితే కళ్ళుమూసుకో ?

ప్రభ : (వేళ్ళమధ్య ఖాళీ ఉంచి కళ్ళుమూసుకుంటుంది)

సురే : అదుగో చూస్తున్నావు ! అమ్మ దొంగా !

ప్రభ : లేదు లేదు ఊ రెడీ ...

సురే : వెరీగ్లాడ్ (నెక్లెసు ప్రభ మెడలో అలంకరించును.)

ప్రభ : (నెక్లెసు చూచి) నెక్లెసా! వెరీనైస్ ఎంతైంది !

సురే : ఫైవ్ తౌజండ్

ప్రభ : ఐదు వేలా ?

సురే : నా హృదయేశ్వరి పుట్టినరోజు వేడుకకు వెధవ ఐదు వేలేంటి ? కావాలంటే కనకాభిషేకమే చేయిస్తాను. ఇంకా కోరితే కెనాలే కొని తన్మయములో ముంచేస్తాను!

ప్రభ : సురేష్ నీ మాటలతో నా మనస్సు పరవళ్ళు త్రొక్కుతుంది !

సురే : ఆఁ

ప్రభ : ఔను

సురే : అయితే ఏదీ ఒక చిన్న...పట్టుకోబోతాడు

ప్రభ : ఉహూ! (దూరంగా పోబోతుంది.)

రే: పాట—(సరజ్ తెర చకర యె యా దిల్ దడు బాజారే)

వెన్నెల కాలగదుగో నా మన కన్నుల కింపౌతుంది
రావా చూడా రాజు మణిరో రావే ప్రియురాలా
రావేలా జవరాలా ॥వెన్నెల॥
చిలుకా పలుకులదానా చిరునగవులు చిందేజాణా
శాటిన్ సిల్కూ సెంటూ పౌడర్ సింగారించుకురావె
ఆడుగడుగో ... అల్లడుగో
అందాలా రేడల్లడుగో ఆనందముతో
ఆడుచు పాడుచు హాయిగా మీరా రావె
రావే ప్రియురాలా రావేలా జవరాలా ॥వెన్నెల॥
సన్నజాజులతోటా - సవజోడి వలపుల పాట
వయ్యారంగా ఒంటరిపాటుగ వీణామీటుచు రావె
ఆడుగడుగో...అల్లడుగో అందాలా రేడల్లడుగో
ఆనందముతో ఆడుచుపాడుచు హాయిగా మీరా రావె
రావే ప్రియురాలా రావేలా జవరాలా ॥వెన్నెల॥

(దగ్గరకు తీసుకుంటాడు)

ప్రభ : సురేష్ (లాలనగా సురేష్ తల నిమురుతూ)

సురే : ఏం డార్లింగ్ ?

ప్రభ : ఇంత ఆనంద సమయంలో కూడా నాకొక్కటే కొరత కన్పిస్తుంది.

సురే : నీ కొరతలన్నీ చిటికలో తీరు__ ! దేవిగారి మనస్సులో కొరతలకు బాబుగారి పాకెట్లో నోట్లకేం కొదువలేదు! (డబ్బు ఇస్తాడు)

ప్రభ : మీ నాన్నగారిని పిస్టలుతో బెదిరించి నోట్లు సంపాదించ గలిగావుగాని మనగురించి ఆడిపోసుకునే ప్రజల నోళ్ళు మూయించ గలిగావా ? (డబ్బు తీసుకుంటుంది)

సురే : అంటే

ప్రభ : మన పెళ్ళి సంగతి.

సురే : ఐసీ, అదా, పెళ్ళికాకపోతే మాత్రము మనము భార్యా భర్త_లము గామూ ఏంటీ ?

ప్రభ : మన మిద్దరము అనుకుంటే సరిపోతుందా ? సంఘం హర్షించ వద్దూ, కానీ ...

సురే : కాని ...

ప్రభ : పెళ్ళిగాకుండా ఏంటీ ముసుగులో గుద్దులాట.

సురే : అదే నేనూ ఆలోచిస్తున్నాను, కానీ ...

ప్రభ : కానీ ...

సురే : లేవతీసుకొని వచ్చిన ...

ప్రభ : (కోపంగా) సురేష్

సురే : సారీ ! ఓ, కోపం వచ్చిందా (లాకలోతాడు)

ప్రభ : (మూతి ముడుచుకొని ముఖము చాటు చేసుకుంటుంది.)

సురే : వహ్ ఏదీ ఓ చిన్న నవ్వు (అంటూ చక్కలిగింతలు పెడతాడు)

ప్రభ : మాటలతో నన్ను మోసగిస్తావా ? ఇంతకాలం నన్ను పెళ్ళి చేసుకుంటానని నమ్మించి, యిప్పుడిలా బాసతప్పు తున్నావా ? (అంటూ కన్నీరు పెడుతుంది)

సురే : (కన్నీరు తుడుస్తూ) ఆల్ రైట్, ఆ మూడుముళ్ళు వేయ లేదనేగా, ఆ యేడుపు ! ఆ రెండుముళ్ళు వదులుగా వేసి, మూడోముడి గట్టిగా వేస్తే పోలా !

ప్రభ : అంతా మోసం, పట్టిదగా !

సురే : నిన్నేం మోసం చేయడంలేదు, ఏదో పరిహాసానికి అలా (గడ్డాన్ని తాకుతూ) కదిపిచూశాను, అంతే.

ప్రభ : నేనేడుస్తుంటే నీకు సంతోషమా సురేష్ ?

సురే : కరెక్టు, నువ్వేడుస్తుంటే శ్రీరంజని ఆలాపించే శివరంజనిలా ఉంటుంది. ప్రభా, అన్నట్టు మన మేరకం మ్యారేజ్ చేసు కుందాం !

ప్రభ : ఏడ్చినట్లే ఉంది, పెండ్లిళ్ళలో గూడా రకాలున్నాయా యేంటి !

సురే : ఊ ! చాలా చాలా రకాలున్నాయి. గుళ్ళో మ్యారేజ్, గాంధర్వ మ్యారేజ్, రింగ్ మ్యారేజ్, రిజిస్టరు మ్యారేజ్ పొంత మ్యారేజ్, రాక్షస మ్యారేజ్, అసలు సిసలు

డొంక తిరుగుడు మ్యారేజ్, అడ్వాన్సు రికార్డుల మ్యారేజ్, దండలు మ్యారేజ్, అదీగూడా ఖర్చనుకుంటే అగటావు కాగితము మీద అరణా సీరాతో అచ్చు గుద్ది నట్లు రాసుకొని చేసుకుంటాం, ఖర్చు తక్కువ, బిగు వెక్కువ, బంధుమిత్రుల బాదరబందీ మూడు నిముషాల్లో ముచ్చటదీరా చేసుకోవచ్చు, ఏమంటావు రాణీ ?

ప్రభ : (హా హా హా) నీ చిలిపి మాటలు నువ్వూనూ. రాతకోతల పెండ్లిండ్లు చేసుకుంటానికి మన మేమన్నా దొరా దొరసానులమా ?

సురే : ఇలా చేసుకుంటే, ఏడేడు పధ్నాలుగు లోకాల్లో, ఏ కోర్టుకి వెళ్ళినా అప్పీలుండదంటే నమ్ము !

ప్రభ : అదేం పెళ్ళి, దిక్కుమాలిన వాళ్ళలాగ పదిమంది సమక్షములో వైభవముగా జరగాలని నా అభిప్రాయము !

సురే : ఓయస్, మన పెండ్లిని గురించి కలలుగంటూ, కలత పడక్కర్లా. మన పెండ్లంటే, సామాన్యంగా జరుగుతుందనా, కనీ వినీ ఎరుగని నూతన పోకడలతో జరుగుతుంది !

ప్రభ : కోయి, కోయి

సురే : నిజంగా ప్రభా ! ఆకాశమంతా పందిరి, భూదేవంత పెండ్లరుగు, నాటకాలు, బూటకాలు, నాట్యాలు, నౌబత్ ఖానాలు, నాగస్వరాలు బ్యాండ్లు, గీండ్లు, భాగవతాలు, భామ కలాపాలు, భీమవిలాపాలు, భరతనాట్యాలు, బాణాసంచాలు, బాకా వాయిద్యాలు, మేజువాణీలు,

మేలుకొలుపులు, మేళాలు, తాళాలు, డోలు సన్నాయిలు, ఢుబుఢుక్ మేళాలు, డబ్బా వాయివాయిద్యాలతో, నవకాయి పిడివంటలు, నాలుగు కూరలతో, (గుర్తు తిప్పుకుని) ఊరూరా, వాడవాడ, దేశదేశాల, ఖండఖండాల నుండి, తండోప తండాలుగా విచ్చేసిన జన సమూహముతో, కన్నులు మిరుమిట్లుగొల్పు ఎలక్ట్రిక్ ట్యూబు లైట్ల ఫోకసింగులతో, పోలీసు బందోబస్తు లెఫ్ రైట్ కొట్టుకుంటూ సాగిపోతూవుంటే, రంభ, ఊర్వసి, తిలోత్తమ, మేనక, గీనక, ఆనక, మొదలయిన దేవ, గాంధర్వ కన్యలు, గానవీణా మృదంగనృత్య ప్రదర్శనాలతో ఉర్రూతలూగించే మయసభ, ఇంద్రసభ, లోకసభలా రంజింపజేస్తుంటే, చూచే వాళ్ళంతా, చిత్తయిపోతారంటే నమ్మవే నా చిన్నారి చిలుకల కొలికీ (అని వ్రేలితో ప్రభ బుగ్గపై చిటికె వేస్తాడు)

ప్రభ : (కిలకిల నవ్వుతూ) అబ్బా! ఎంతగొప్పగా వర్ణించావు సురేష్

సురే : అంత గొప్పగా వరించాము గూడాను!

ప్రభ : అన్నీ చెప్పావు, మరి పురోహితుడో?

సురే : వాళ్ళు లేని పెళ్ళి, ఉప్పు లేని కూరలా ఉంటుంది

ప్రభ : అయితే ముహూర్తం?

సురే : వచ్చే నెల్లో!

ప్రభ : వచ్చే నెల ఆషాఢంగా?

సురే : ఆపై నెలలో చేసుకుందాం!

ప్రభ : నిజంగానా ?

సురే : కాక అబద్ధం అనుకున్నావా ?

ప్రభ : ఏంటో నాకంతా అయోమయంగా ఉంది. నిన్ను నమ్ముకున్నందుకు, పాలముంచినా, నీటముంచినా నీదేభారం!

సురే : ఇంకా అనుమానమా ప్రభా ? నమ్ము నామాట, నీ మీద ఒట్టు ఒప్పుకుంటావా ?

ప్రభ : (మాట్లాడదు)

సురే : ఓహో నామీద నీకంత నమ్మకం లేదన్నమాట (సిగరెట్ నోట్లో ఉంచుకుని అగ్గిపుల్ల వెలిగించి నిటారుగా ఉంచి) ఈ అగ్ని సాక్షిగా, మన వివాహం జరిగిపోతుంది (నిప్పు పుల్ల ఆరిపోతుంది)

ప్రభ : అంతకన్నా నాకేంకావాలి ? చాలామంచివాడివి సురేష్.

సురే : (గడియారం చూసి) ప్రభా

ప్రభ : ఏం సురేష్ ?

సురే : అప్పుడే సెవెన్‌తర్టీ కావస్తుంది. స్నేహితులకు, బంధువులకు ఆహ్వానాలు పంపించాను, ఎనిమిది గంటలకే డిన్నరు, ఆ పైన బ్రహ్మాండమయిన నాట్యం ఏర్పాటు చేశాను. ఈలోగా నీవు వెళ్ళి ముఖ్యమైన పనులు చూస్తూవుండు! ఆ...ఆగాగు ఓ కప్పు కాఫీ (ప్రభ నిష్క్రమిస్తుంది)

(రహీం దగ్గుతూ ప్రవేశము)

సురే : రహీం అందరికి ఆహ్వానాలు అందిన ట్లేనా!

రహీం : జీ హుజూర్.

సురే : రంగయ్య శెట్టి గారో ?

రహీం : వస్తున్నారు హుజూర్ ఆయన సాలాసత్తిపండుభ ఆతా హై !

(రంగయ్య శెట్టి ప్రవేశము)

సురే : మాటలోనే వచ్చారే రంగయ్యగారూ ! యింత ఆలశ్య మయిందేం !

రంగ : నాకోళ్ళ పిపళమా అంట కొట్టు కట్టేసేటప్పటికి యిచ్చి పుచ్చుకునే లావాదేవీలు ఎన్నో ఉంటాయి.

సురే : ఔనౌను ! అందులో షావుకారు బిడ్డలాయె ! సాక్షాత్ లక్ష్మీ పుత్రులు

రంగ : మాదేముందిలెండి బోడివ్యాపారం. బంగారు పిచ్చుకలు మీకేం బాబూ ! ముసలోడు కాస్తా గుటుక్కుమన్నాడంటే ముప్పైలక్షల కధిపతౌతావు ! ఔనంటారా కాదంటారా?

సురే : నిజం ! నిజం ! దానికోసమే ఎదురుచూస్తున్నాను.

రంగ : కాలం ఖర్మం కలిసొస్తే ఆపనులు చిటికలో జరిగిపోతాయి ఏడుకొండలవాడా వెంకటరమణా గోవిందా, గోవిందా!

5)

రహీం : తెరీబాబు సామ్నుపోయిందా! పోయిందా అరేశెట్టి యార్ నీద్ మాటాఖరార్ ఆజ్ నహీంతో సబాబడా మాయ్యాగారు వక్కల్ బేరాన్కిపోతారు.

సురే : రహీం (కోపంగా) అపశకునపక్షి.

రంగ : కోడలు గృహప్రవేశం, అత్త గంగాప్రవేశం అన్నట్లు పుట్టించినవాడా పట్టించుకుపోరా బొబ్బట్ల గంపదగ్గరకు గోవిందా గోవిందా. యివిగో నాబకుమానాలు! (పును గులు, గారెలు యిస్తాడు.)

సురే : ఒక్కసారె ఇంత మొత్తమా!

రంగ : పర్వాలేదు ఉండనీయండి! (జేబులు తడుముకొని) మా యింటి దొడ్డివాకిలి తెరచే ఉంది బాబోయ్ ఐదు నిమి షాల్లో తిరిగి వస్తా.

(రఘు ప్రవేశం)

సురే : హాల్లో గుడ్ఈవెనింగ్, రఘు!

రఘు : గుడ్ఈవెనింగ్

సురే : టేక్ యువర్ సీట్

రఘు : (కూర్చుంటూ) నో మెన్షన్ ప్లీస్

సురే : హౌ ఆర్ యూ ?

రఘు : డూయింగ్ వెల్ (సిగరెట్ పెట్టెతీసి) ప్లీస్ సిగరెట్

సురే : థాంక్యూ (తీసుకొని నోట్లో ఉంచుకొనును.)

రఘు : (సిగరెట్ విప్పాపుల్లతో వెలిగించి సురేష్‌ని కాల్చుకో మని వెల్గుతున్న పుల్లను ఆతని సిగరెట్‌కి ముట్టించిన తరువాత ఒక దమ్ములాగి) నాకు ప్రత్యేకంగా సర్వారుతో ఇన్విటేషను కార్డు జ్ఞాపకంగా పంపావె!

సురే : అయినా బొట్టు కాటుక పెట్టి పిలిపించడానికి నువ్వేమైనా పరాయి వాడివిరా ఏదో వాడుక చెప్పానగాని

రఘు : లేదులేరా బ్రదర్, మనకు ఇక్కడికే ట్రాన్స్‌ఫరు అయింది. డ్యూటీ అయిన తరువాత కాలమంతా నీయింట్లో గడపమన్నా గడుపుతా, రాయల్ లాడ్జిలో దోమల బాధన్నా తప్పుతుంది. ఏమంటావ్ ?

సురే : సరే అంటాను. అయిన ఈ రెండు నెలల నుండి ఎలా గడుపు తున్నావోయ్ ?

రఘు : అక్కడేరా మన గొప్ప (దేనికోసమో నాలుగు వైపుల ఎదురు చూస్తుంటాడు)

సురే : ఏంటీరా బ్రదరు చూస్తున్నావు ?

రఘు : అదేరా! నీ శ్రీమతి ఎక్కడా కన్పించక పోతేను

సురే : (హా హా హ) అదా ఏదో పోగొట్టుకున్న వాడిలా వెతుక్కోపోతే సరాసరి నన్నడిగితే నీ సందేహం తీర్చే వాణ్ణిగా ప్రభా ... ప్రభా (తెరలో)

ప్రభ : ఆఁ వస్తున్నా (ప్రభ ప్రవేశించును)

సురే : కమిన్ డార్లింగ్ (సురేష్‌కి ఎదురుగా వస్తుంది) (తలవని తలంపుగా రఘుని చూస్తుంది. అర్ధంగాని

బాధతో త్రుళ్ళిపడుతుంది. రఘు ప్రభలు పోటీలుపడ్డ పోట్లాళ్ళలా చూసుకుంటారు. అప్రయత్నంగా చేతిలో కాఫీగ్లాసు విడిచిపెడుతుంది)

సురే : ఏమయింది ప్రభా ?

ప్రభ : ఏమీ లేదు కళ్ళుతిరుగుతున్నట్లయింది.

సురే : అయితే ఇలా కుర్చీలో కూర్చో.

ప్రభ : పర్వాలేదు లే.

రఘు : హు యీజ్ షి.

సురే : షి ఈజ్ మై.

రఘు : ఓ ఐసీ అర్థమయింది

సురే : ప్రభా చూడూ, ఈయన నా స్నేహితుడు, పెద్ద సినిమా ప్రొడ్యూసరు

రఘు : (కరచాలనం చేయబోతాడు.)

ప్రభ : నమస్కారమండి ! (నమస్కరించి ముఖం చిట్లించు కుంటూ చీదరగా లోనికి పోతుంది)

రఘు : (హాహాహా) వారు నన్ను అపార్థం చేసుకున్నారను కుంటాను. నేను రావడం వారికేమైనా కష్టంగా ఉంటే (లేవబోతాడు)

సురే : ఏడ్చావుగానీ అలాకూర్చోవోయ్ కారణాలు లేకుండా కలతలు పెంచుకుంటాం. ఉండు నేను ఇప్పుడే వస్తాను! (నిష్క్రమిస్తాడు రంగశెట్టి ప్రవేశిస్తాడు)

రఘు : (సురేష్ వెళ్ళేవేపు చూస్తుంటాడు) ప్రభ ... ఎంత చక్కని పేరు? వాట్ ఏ బ్యూటీ వండర్‌ఫుల్. (సిగరెట్ వెలిగించి పరధ్యానంగా ఆలోచిస్తూ ఉంటాడు.)

రహీం : శెట్టిగారు ఒకపాట పాడండి!

రంగ :- చిన్నప్పుడు బాగాపాడే వాణ్నే లేవోయ్!

రహీం : జొనాను బ్రహ్మాండముగా పాడుతావ్. మేమంతా అల్లాడి పోవాలి. చిన్నప్పుడు బాగాపాడి హేడిస్తే ఇప్పుడూ ఒకటీ పాటపాడవయ్యా

రంగ : అదదే ఆకూతే కూయొద్దన్నాను. మా వాళ్ళంటే అడ్డమయిన వాళ్ళకూ లోకువే. శెట్టిగారూ అని పిలవలేవూ;

రహీం : అట్లాగే పిలుస్తాను (హిహిహి) ఏదీ ఒకటి పాటపాడు

(సత్తిపండు ప్రవేశము)

సత్తి : బావోయ్ బావా!

రహీం : (హి హి హి)

రంగ : రా రా సత్తిపండు

సత్తి : (వస్తూ) అంతా మొగోళ్ళు సిగ్గేత్తుంది బావా

రంగ : ఏంటి సంగతులు?

సత్తి : అక్కోం ఉత్తగం రాసింది (చొక్కా మడతనుండి ఉత్తరం తీసి) ఇదిగో.

రంగ : ఏమని రాసింది నన్నేమన్నా పొగిడిందా?

రహీం : పొగిడింది, నిగిడింది క్యాబే!

సత్తి : ఉండయ్యా, ఏంది నడాన్న నీ సరసం ? నీ చక్కదనానికి తోడు ఎక్కిరింపు ఒకటికాబోలు ! దేముడా అంటూ మా అక్క నీలోసుకుంటే మధ్యనేంది నీ గొరిగింపు?

రహీం : అదిహేమిటీబే రోజూ అవిడా నీళ్ళు పోసుకోవడము లేదుబే

సత్తి : వూ వూ ... నా బంగారు కన్నే (అంటూ మెటికలు విరిచి)

రహీం : శబాబాష్ మెరీ ప్యారీబేగం

సత్తి : నీ జిమ్మడిపోను నిన్ను క్రొత్తమ్మోరేసుకుపోను, నిన్ను పాతమ్మోరు వేసుకుపోను, ని మొదలారా, నీ యిత్తన మూతా, నిన్ను దంసంచేయా, నీ శికసున దీపంబెట్టా, శుభమా అంటూ మా అక్కకు కడుపులో,

రహీం : నొప్పి హొచ్చిందే బే నొప్పి

సత్తి : అదిగాదురా సచ్చినోడా పాపాయి పుడుతాడురా! పాపాయి.

రహీం : అచ్చా శెట్టిగారు యిక్కడవుంటే అమ్మగారు అక్కడ నీళ్ళు పోసుకున్నార్. అర్థమయ్యింది అర్థామయింది ఈయువ గాలిపోయి ఆమెకు సోకింది అన్నమాట.

రంగ : సాయిబూ నోటికి వచ్చినట్లుగా కూస్తే బుద్ధి చెప్పిస్తా అప చారం (చంపలు వేసుకొనును) ఏ డు కొం డ ల వా డా గోవిందా గోవిందా !

రహీం : బుద్ధిగాదు బే నమిలి గడ్డేపెట్టు.

సత్తి : ఆ ముద్రప్ప పోడితో మనకెందుకుగానీ ఆ వెంకన్న స్వామి గుడి మీది బూడిద అక్కకు మా బాగా పని చేసింది బావా?

రంగ : ఔనురా మాగొప్పగా పనిచేసింది. అంతా ఆయన మాత్యం.

రహీం : సంతానానికి బూడిద ఎందుకూ బే గాడిదా ? అసల్ దేవుడు గుడి మే ఉంటే పిల్లల్కి యిచ్చే దేవుడు తోటల్ మే ఉంటాడు. (హి హి హి) అరె శెట్టి య్యారు మాటల్ సంద డి మె మనువు మరచినట్లు ఒకటీ సినిమా పాట పాడవయ్యా దొంగరాముడ్ మె వస్తాయ్.

రంగ : రావు.

రహీం : అగ్గిరాముడ్ మె.

రంగ : రావు

రహీం : అచ్ఛా బలేరాముడు మె, సావిత్రికి రెండువున్నాయి లేదూ అందూమె ఒకటీపాట ఓహో మేకమూల పాడ తావు.

రంగ : మేకమూలారాదు, తోకమూలారాదు సత్యప్రమాణ కంగా చెబుతున్నాను అమ్మతోడు, నాతోడు, నీతోడు.

రహీం : చుప్ రేచుప్, నాకీముందు, ఆ పందులు గారికి ముందు చాలా నాటకాల్లో హీరో వేశావని కోతలు కోశావు లేదూ.

(మీదకు పోబోతాడు)

రంగ : తగ్గవోయ్ తగ్గు, వెర్రిమొకమా ! నేను సన్నంగా ఉన్నానని మీదమీదకు వత్తున్నావా ఏఁటి ? నా మీద గాదు నీ ఘాండ్రింపు మాతో డల్లుడీమీద చూపించు నీరగతం ల్రాగుతాడు.

రహీం : మీా తోలుహల్లుడు హెందుకూ బే కు స్త్రీకి వస్తావ్ (తొడగొట్టును)

రంగ : ఓయబ్బో నీ ఏసాలింక కట్టవోయ్ మా వాళ్ళ వందర్ని మంచిచేసు కున్నానంటే కన్నికామవారి గుళ్ళో పెట్టించి డొక్క చించి డోలుకట్టించేస్తాను. నా తడాకా నీకు తెలియదను కుంటాను. మనం చెంచులక్ష్మి నాటకంలో ఆదిలక్ష్మి యేశికం ఏసుకొని టేజిమీాదకొచ్చి ...

చెటులెక్క గలవా ఓ నరహరి పుట్ట లెక్కగలవా (గొంతు మార్పుతో) చెట్టు లెక్కి ఆ చిటారుకొమ్మన చిగురు కోయగలవా ? ఆ ప్రాణేశ్వరా ! ఆ ప్రాణ సఖా, ఆ ప్రాణ ప్రియా అంటూ టేజిమీాదకొత్తె.

రహీం : చెప్పులికి హెంగిరేవి శెట్టిగారు అవుపేడేశ్వరా ఆపేడపియా క్యాబే ? హెపుడో ఆడిన సంగతి హెందుకూ బే ఇప్పుడూ ఒకటీ పాటాపాడు ?

రంగ : అయితే నాకీకాలం పాట లేంరావు. పాడాలంటే చింతామణి లోదే పాడేస్తాను

రహీం : అచ్ఛా అచ్ఛా పాడుపాడూ.

రంగ : ఒరే నానిపండూ, ఒరే నత్తిపండూ.

సత్తి : ఏం బావా ?

రహీం : హారే ముద్దులపండూ అరే కుమ్మిడిపండూ.

రంగ : సాయిబుతో మన కేంటిగాని తాళం వేయరా!

సత్తి : అట్టాగే బావా ఏందే సాయిబు సచ్చినోడు యిటుచూసి సత్తాడు.

రంగ : సగిలెన్ను గిగిలెన్ను పీక రేదీ సాయిబూ మరి మూాజిక్కో!

సత్తి : బావోయ్ చింతామణిలో పాటపాడు బావోయ్.

రంగ : (గొంతు సవరించుకని) స — సా — సా — (స్థాయి పెంచును)

రహీం : ఏమిా ఖంటమయ్యా నాకి నిద్రవస్తోంది.

రంగ : పాడమంటాడు పంగనామాలు పెడుతుంటాడు. పోయిన యుద్ధంలో బాంబూల మ్రోతకు నా గొంతు బొంగురు పోయింది లే, విను.

రహీం : పాడు.

రంగ : (గొంతు సవరించుకని) స రి గ మ, ప ద ని స, స ని ద ప, మ గ రి స, (స్థాయి పెంచును.)

రహీం : నీ సుతి ఏంతా హయ్యా ?

రంగ : ఏడు

రహీం : పాడు, పాడూ

రంగ : పిల్లి సమర్తాడిందంటే బళ్ళమీద గుళ్ళులాంటి మిఠాయుండలు పంపినాను. వాడికి దీనికి ఆపోరంబోకోడికి అది గాక అడ్డమైన వాళ్ళకు లా లెటరు మోసినాను. మేళానికెళ్ళొచ్చి మొదలక తొంగుంటె – బిడియ మిడిచి కాళ్ళు పిసిగినాను – ఓం, తరిన దరినాం, తరిగిడిదం, గోడ పెడదాం, పడగొడదాం, మళ్ళీ పెడదాం!

రహీం : (హిహిహి) అరె బేవకూప్, ఆడదానికి కాళ్ళు పిసుగుతావ్ (దివ్వలు చూసుకుని) అల్లాహు అక్బరు, యారసూలిల్లా, తలపోట్, తలపోట్ యేమీ పాటవయ్యా, నీ పాటకు గాడిదల్ వస్తాయి, మదరాసు వస్తావ్?

సత్తి : ఎందుకూ?

రహీం : ఘంటసాలకు ప్లేబ్యాకు పాడడాన్కి.

సత్తి : యేది సచ్చినోడా, అట్టంటావ్? ఇక్కడ మాకు వడ్డీలలో వచ్చే లాభాలు చాలక, మదరాసు వెళ్ళి బ్యాకివ్వాలంట

రహీం : బ్యాకూ క్యారే సాలా, బ్యాకూ పేబ్యాక్ బోలో అరె శెట్టియ్యాకు, ఇది ఇంతకూ ఆడా లేకా మగా

రంగ : చూడరాదూ మధ్య నేనెందుకూ, నన్నేమన్నా ఒప్పుకుంటాను గానీ, మా సత్తిగాణ్ణి యేమన్నా అంటే ఒప్పుకునేది లేదు! మా వాడికి గారడీ వాడదేందో, దాని పేరు గావతములా ఆ దే అదేందో, అదేలే అదేదో ఇచ్చాడు, వీడిముందు సినిమా యాట్రలు అంతా బలాదూరు

రహీం : అచ్చా అచ్చా పాడమను

రంగ : పాడరా, సాహెబు దంగైపోతాడు

సత్తి : యేం పాట పాడమంటావు బావ !

రంగ : మల్లేశ్వరో, కల్లేశ్వరో పాడేయ్.

రహీం : అయ్యా మొగంచూడు, సఖియా మొగం (హిహీహి)

సత్తి : చూడు బావా ! సాహెబు నవ్వుతున్నాడు. నేపాడను.

రహీం : నీకు చూచి హేవడు నవ్వాడు బే! గాబేగా ?

సత్తి : అంతా మగాళ్ళు సిగ్గేతుంది, నన్నెట్ట పాడమంటావు !

రహీం : ఇంతకు ఇథి హైదరాబాదునుండి హెపుడూ వచ్చింది. పర్వాలేదు, గాబేగా !

సత్తి : 1-వ పాట వినుగన్న సుతనాకు స్నిటుగాడా అన్నమే రుచిగాదు అందగాడా ! ॥విను॥

2 పిలచినా బిగువటరా ఔరౌరా, భళిరా సాహెబూ ॥పిల॥

3. జామచెట్టెక్క నేలా ఓ సాహెబూ జామకాయలు కొయ్యనేల యీవూరి కుర్రోళ్ళకి రుచిమప్పనేల విన్నేల పోనిత్తురా ॥జా॥

4. మందార గంధమిదె సాహెబూ రాసుకోరా ॥మందా॥

5. నామక్కువ దీర్చర మోహానరంగా టక్కులు చేయకురా ॥నా॥

(పాడుతూ నాట్యము చేస్తుంటాడు)

రహీం : పాట

1. సత్తిపండు ఇన్నరాత్రే కమ్మా కమ్మని ముద్దిబే నీవంటే
నాకీ ఎంతో ప్రేమ ఉంది తెలదూబే ||సతి||

2. పండూ పండూ అంటు పలుకులలో బడిచస్తారా ||
సేవలుకులలో బడిచస్తారా ||పండూ||

మాటలు : (మోకాలుమీద కూర్చుండి చేతులుచాపి)
ఓ మెరీ ప్యారీ ఓ మెరీ అనారుకలీ ఓ మెరీజూలెట్ తెరీ పాటకు యీ రహీంగాడు సలాం జేసి గులామ్ ఔతున్నాడు. అరె సఖియా, సత్తిపండు ఆటకూహారటీపండు, చూపుకు నల్లచింతపండు, నీదిపాట వింటూంటే నాకే గుండెల్ మె గుబేలు గుబేలుమంటూ బేజారు బేజారు ఔతుంది. తూ తెరీకి (వుమ్మూసి) సిగ్గూ లేదూబే నాకీ చూచి ప్రేమాచేస్తావ్? అరె శెట్టియ్యారు ఇది యేమిపాటవయ్యా వెధ్వపాట.

రంగ : ఆమాత్రము నువ్వు పాడూ అంట.

రహీం : అచ్ఛా! అలాగే మేమూ పాడుతామ్. మాదీ పాట వింటే వాళ్ళఋణ ఆగి తబలా ప్రేలి ఆడింగ్సు అంతా ఘూలు మంటారు బే.

సత్తి : పాడవయ్యా మాకన్నా మాలావుగా పాడుతావా ఏంటి?

రహీం : జరూర్ పాడుతామ్ తాళం వేయుండీబే. (ఇద్దరూ సరే సరే అంటారు.)

పాట : (కవాలీ)

కుంభకర్ణుని తమ్ముడు భీమసేనుల్
ఆ ఆ ఆ ... కుంభ
దమయంతికి లేజాకో
లంకామె బెట్టేసర్కి
మళ్ళీ ఎందుకో పెట్టేసర్కి
హనుమంతుడు కోపంవచ్చి.

సత్తి : వాడెవడు.

రహీం : రాములు వారికి బంటు.

రంగ : ఔనౌను.

రహీం : పాతాళానికి దుమికి
బ్రహ్మ ముక్కు పట్కొని
గిరగిరా త్రిప్పేసరికి
బ్రహ్మకు మూడే ముఖాల్ ... బ్రహ్మకు
మూడేముఖాల్ ... బ్రహ్మకు మూ
డేముఖాల్
చుప్ రే చుప్.

సురే : (ప్రవేశించి) రహీం.

రహీం : ఓ సర్కార్.

సురే : ఫలహారాలు సిద్ధమయ్యాయి అందరూ లోనికి రండి.

రంగ : (నాలుక తడుపుకుంటూ) సత్తిపండు లోలోనికి పోయి
తిరిగి కొద్ది సేపట్లో వస్తాడు.

(ఒక స్టాండుమీద బ్రాందీ సీసా, ఒక గ్లాసు, సిగరెట్ టిన్, అగ్గిపెట్టె, ఆష్ ట్రే వుంటాయి. సురేష్ ముందుగా కుర్చీలో కూర్చుని, సిగరెట్ వెలిగించి ఒక దమ్ములాగి, గ్లాసులో బ్రాంది పోసుకుని గడగడా త్రాగుతూ ఉంటాడు. ప్రభాదేవి ప్రవేశించి, సురేష్‌ని త్రాగనీయకుండా అరికట్టాలని ఎంతో ప్రయత్నించి చివరకు విఫలురాలయి)

ప్రభ : సురేష్ ! త్రాగుడు మరిగావా ?

సురే : (త్రాగుతూ) ఔను.

ప్రభ : ఆరోగ్యం చెడదూ !

సురే : చెడదు ...

(పాట :- మార్చింగ్ సాంగ్ వలె)

సాకీ : యు, డ్రింక్ ఏ పెగ్ ఆఫ్ బ్రాందీ
ఇట్ గివ్స్ హెల్తు టు ది బాడీ
ఐ రిక్వెస్టు యు టు డ్రింక్, ఆన్ ఎవ్వర్ బాడి హా (నవ్వు)
హా హా హా హా హా హా హా హా హా

పాట : నా కన్నులలో మెరిసే, నా కన్న గులాబివే లేడిస్టు
మోడల్ మ్యారేజ్, ఐ కెన్ మ్యారీ షూర్

(తిరిగి మాటలతో అంటాడు)

పాట : మే కింగ్, జో డాఫ్ రోగమ్
గివ్ మీ సమ్ థింగ్ భోగమ్
కమ్ టూ మై గుడారమ్

ఆన్ ఎవ్వరీ యీవెనింగ్ హా
(నవ్వు) హ హా హా హా

(తిరిగి మాటలలో అంటాడు.)

మాటలు : మై రోజా, ఇక సోజా, నువ్వు రావా, ఇది త్రాగా, దిన్ ఎంగిల్ బ్రాండీ హా (త్రాగి ప్రభ కందివ్వబోతాడు)

ప్రభ : (చేతిలో గ్లాసు లాక్కొని లోపలికి పోతుంది.)

సురే : (విషాదంతో) ప్రభా ప్రభా (ప్రభ వెళ్ళేవేపు చూస్తూ పిలుస్తాడు జవాబురాదు. నిరాశజెంది, స్టాండుమీదవున్న సీసా తీసుకుని త్రాగబోతు వుంటాడు.) (సతీష్ ప్రవేశించి, తలుపు కొడుతూ ఉంటాడు.)

సతీ : సురేష్, సురేష్ —

సురే : ఎవరది, కమిన్ కమిన్ (సతీష్ ప్రవేశిస్తాడు.)

సురే : హల్లోవ్, మైడియరు బ్రదరు సిడౌన్ హియరు.

(సతీష్ కూర్చొంటాడు.)

సురే : కూర్చో బ్రదరు, మంచిసమయానికే వచ్చావ్, మన శ్వాంతి కోసం నువ్వు గూడా కొంచెము త్రాగరా! (సతీష్ నోటి దగ్గర సీసా పెట్టబోతాడు)

సతీ : (చేతిలో ప్రక్కకు సురేష్ చేతిని తోస్తాడు)

సురే : మంచిది. చాలా మంచిది, ఏం త్రాగవా? (హహహహ) జారిపోయిన అవకాశము, తీరిపోయిన అదృష్టము తిరిగి రావురా బ్రదరు, కొంచెం త్రాగు.

సతీ : దుర్మార్గులకేగాని, దుర్వ్యసనాలు మాకెందుకు !

సురే : వండకుఫుల్ వర్డు, ఇష్టముంటే త్రాగు, కష్టమయితే ఘూనేయ్, అదంతా నీ యిష్టం, మన ఫాదరు కుశలమేనా!

సతీ : నీవంటి కొడుకును కన్న తండ్రికి కుశలమొక్కడిది, నాశనమే గాని సురేష్ యీ విషాదవార్త విన్నావా ?

సురే : ఏంటది, ఏమైనా లాటరీలో లక్క ప్రైజు రాలేదా ఏంటి?

సతీ : వచ్చింది జీవితానికి ఒకటే లోటొచ్చింది.

సురే : ఏంటది ?

సతీ : నీ ప్రవర్తనకు, వస్తున్న అవమానాన్ని భరించలేక, నాన్న గారు ఆత్మహత్య చేసుకున్నారురా (ఏడుస్తూ చెబుతాడు.)

సురే : వాట్ .... (గంభీరంతో కూడిన ఆశ్చర్యముతో) చచ్చి పోయారు (ఒక నిముషం నిశ్శబ్దం వాయిద్యాలు నిశ్శబ్దంగా మ్రోగుతూ వుంటాయి, సిగరెట్ వెలిగించి) చావు కబురు చల్లగా తెచ్చిందుకు చెంపలు వేసుకోరా బ్రదరు (ఆలోచనగా) యీ నాటి నుండే మనం సర్వసంపదలపై సర్వాధికారులమన్న మాట (స్వగతం)

సతీ : (కోపంగా) నీకు కావలసింది డబ్బురాడబ్బు. డబ్బు వచ్చిందన్న సంతోషమేగాని తండ్రి గతించాడన్న విచారమైనా లేదన్నమాట

సురే : ఛీఛీఛీ ఆ గ్రహచారము మనకెందుకు ?

సతి : ప్రపంచములో యే వస్తువయితే అమూల్యమో, యేదైతే అలభ్యమో అటువంటి కన్నతండ్రి ఆకస్మిక మరణము

గురించి కనీసం కన్నీరయినా కార్చనివాడిని నీవు ఒక కొడుకువా? చెడుసహవాసాలతో అమూల్యమైన నీ జీవితాన్ని చేతులారా నాశనం చేసుకుంటున్నావా? మన వంశములో వెయ్యి కంచుకాగడాలతో వెదకినా మచ్చుకొక్కడయినా గన్పించడురా? పుత్రుడవై పుట్టి శత్రువుడవై సాధిస్తున్నావా!

సురే: దటీజ్ కరెక్టు!

సతీ: కనీసం దహనచర్యల నిమిత్తమయినా వస్తావా?

సురే: వీల్లేదు. యీనాడు ప్రేయసి పుట్టినరోజు

సతీ: ఒకరికి పుట్టినరోజు వేరొకరికి గిట్టినరోజూనా? అయితే జరుగవలసిన పనులు?

సురే: అందుకు మీరంతా ఉన్నారుగా?

సతీ: ఆహా! ఎంత నీచానికి వడిగట్టుకుంటున్నావురా? మేమెంత మంది యేంజేసినా పరలోకములో నాన్నాగారి ఆత్మకు శాంతి ఎక్కడ నుండి వస్తుందిరా! కావాలంటే నీ కాళ్ళయినా పట్టుకుంటాను. (కాళ్ళ మీద పడబోవును.)

సురే: అందుకు నీ తప్పులన్ని క్షమించాము. నా కాళ్ళు పట్టుకున్న దానికి ఫలితంగా కట్టెతో కైలాసమో, బొందితో భద్రాచలమో, పోతావు!

సతీ : ఆఖరుకు పశువులను చంపే కసాయివాడికన్నా హీనంగా తయారయ్యావన్నమాట. చెప్పవలసిందంతా చెప్పాము.

సురే : అయితే వినవలసినదంతా విన్నాము.

సతీ : వినవలసింది ఇంకావుంది, నీ మిత్రులే నీకు శత్రువులౌతారు. ఏ స్త్రీతో స్వర్గముందని తలంచి దుర్వ్యసనాలకు చిక్కి పతనమై పోతున్నావో. అందులోనే నీకు నరకముందని మాత్రము మరచి పోకు! ఆమె వల్లనే నీ జీవితము, అంత మౌతుంది, ఆమె నీ ముఖంపై తుపుక్కున ఉమ్మివేసె రోజు వస్తుంది.

సురే : షటప్ (చెంపకాయ కొట్టును.)

సతి : (చంప తడుముకుంటూ) చాలా? నీకసి తీరిందా? తీరక పోతే ఈ చెంపమీదకూడా కొట్టరా? ఈ ఒక్కమాట మాత్రము గుర్తుంచుకో. నీ పాపాలు పరిపక్వమయే రోజులు, ఇంకా ముందున్నాయి. ఒక రోజున నీవు చేసిన ఘోరకృత్యాలు తలచుకొని, తలచుకొని, క్రుళ్ళి, కృంగి, నశించి, నాశనమయ్యే రోజులు అసన్నమౌతాయి. నాన్న గారి మరణ శాసనాన్ని తలచుకుంటే, గుండెపగిలి చావ వలసి వస్తుంది. నా చేతుల మీదె దహనచర్యలు జరుపు తాను. వస్తా. (కొంతదూరము పోయి) మరొక్కమాట, నేను వెళ్ళినా నీలో పరివర్తననేది కలిగితే త్వరగా రా శెలవు వస్తా. (నిష్క్రమించును)

(సురేష్ ఒక సిగరెట్ వెలిగించి పిచ్చివాడిలా అటూ ఇటూ తిరుగుతూ వుంటాడు. మరొక రెండు నిముషాలు గడుస్తాయి కోపంగా)

సురే : రహీం ... రహీం !

రహీం : జీ సర్కార్.

సురే : (జవాబు చెప్పకుండా పిచ్చివాడిలా వీధివైపుకి పరుగెడు తాడు రహీం అతన్ని అనుసరిస్తాడు ప్రభ ప్రవేశించి)

ప్రభ : సురేషు ... సురేషు (పిలుస్తుంది సమాధానంరాదు విచారంగా సురేషు వెళ్ళిన వైపు చూస్తూ తిరిగివచ్చి టేబుల్ మీద నున్న సురేషు ఫొటోను చూస్తూ వుంటుంది.)

(వెనుక నుండి రఘు ప్రవేశించి దగ్గుతాడు)

ప్రభ : వచ్చావా సురేషు (రఘును చూచి త్రుళ్ళిపడుతుంది)

రఘు : (చిన్నగవ్వునవ్వి) ఫర్వాలేదు భయపడకు.

ప్రభ : నువ్వా ?

రఘు : ఔను.

ప్రభ : ఎందుకొచ్చావు ?

రఘు : నీ కోసమే ? ఏం రాగూడదా ?

ప్రభ : ఇక్కడగూడా తయారయ్యావా ? వెళ్ళిపో ?

రఘు : (హాహాహా) వెళ్ళడమా ! ఎక్కడికి ? ఎప్పుడెప్పుడా అని ఎదురు చూస్తున్న అందాలభరిణె ప్రత్యక్షమైనప్పుడు కాల దన్నుకునే మూర్ఖుడెవడైనా ఉంటాడా ! ఆనాడు తప్పించు

కున్నావు. ఆశబోయిన తీర్థ మెక్కువైనట్లు అనుకోకుండా కలుసుకొని అవకాశాన్ని జారవిడుచుకో మంటావా ?
(తలుపులు మూస్తాడు)

ప్రభ : రఘు : ఏంటీసాహసం ? ఇప్పుడు సురేషువస్తే నీ బ్రతుకేమౌతుందో తెల్సా !

రఘు : నా బ్రతుకేం పర్వాలా, నీ బ్రతుకేమౌతుందో ఆలోచించుకో ? చిరకాలమునుండి నాలో గూడు కట్టుకొనిపోయి జీర్ణించుకున్న కోర్కెలలు ఇపుడు తీర్చుకొంటాను.

ప్రభ : దుర్మార్గుడా, స్నేహితునిగా ఆదరించిన సురేష్ కే ద్రోహం తలపెడుతున్నావా ! మర్యాదగా వెళ్ళిపో ద్రోహీ !

రఘు : (కోపంగా) ద్రోహి ... (హాహాహా) ఎవరూ ద్రోహీ. మాట్లాడవేం ? ప్రభా నిన్ను నీవు మరచిపోయినా, లోకం నిన్ను మరచిపోదు. నీవొక హంతకురాలివన్న సంగతి మరచి పోయావనుకుంటాను, భార్యగా నీకాశ్రయమిచ్చిన నీ భర్తకు ద్రోహం చేయగాలేంది, నేను నా స్నేహితురాలికి చేయడము ఒక లెక్కా ? హంతకురాలా?

ప్రభ : హంతకురాలినా కాను, ఎన్నటికిగాను.

రఘు : నిరూపిస్తాను.

ప్రభ : అబద్ధం, వట్టి అబద్ధం. నేను నీకేం అపకారం చేశానని యిలా కథలు కల్పించడం.

రఘు : నేను కట్టుకథలల్లి గా లోకానికి కట్టుకథ లల్లవలిసిన అవ
సర మేముంది ? ఇదిగో ఇటుచూడు. (పేపరు చూపిం
చును.)

ప్రభ : ఏంటది ?

రఘు : నీ జీవిత రహస్యం ! అజ్ఞాతవాసంలోవున్న నీ హంతకి
జీవితాన్ని లోకానికి వెలుగెత్తిచాటే ప్రచ్ఛన్న ప్రకటన.

ప్రభ : ఆ ...

రఘు : అదిరిపోకు (చదువుతాడు)

"కాకినాడ మే 12, అంతఃపురములో అంతుచిక్కని
పరమ రహస్యం, లక్షాధికారి నారాయణరావుగారి సతీ
మణి అకస్మాత్తుగా అతఃపురమునుండి అంతర్ధానము.
పోలీసులు అన్వేషిస్తున్నారు. ఆచూకీ యింకా దొరకలేదు.
అనుమానంచేత దాసీ నరసమ్మను అరెష్టు చేయగా ఆమె
నారాయణరావు హత్య చేయబడి ఉంటాడని, అతని
భార్యా వలచిన ప్రియునితో పరారయి ఉంటుందని స్టేటు
మెంటు ఇచ్చింది."

ప్రభ : (భయంతో నోటిమాటరాక నిశ్చేష్టురాలౌతుంది)

రఘు : ఏం యిదీకట్టుకథేనా ? ఇప్పుడు దీనికి నీ సమాధానం
మాట్లాడవేం (హహహ) ప్రభా నీ జీవితం నా గుప్పిటల్లో
ఉంది (గుప్పిట మూసి ప్రభకు చూపిస్తూ) నేను అరచేయి
మూస్తే నీకు స్వర్గం, తెరిస్తే నరకం ఏమంటావు, నేను
తలచుకుంటే నిన్ను సురేష్‌ని ఉరికంబానికి ఎక్కించగలను.

ప్రభ : వద్దు .... వద్దు (బతిమాలుతూ) అంతదారుణానికి వడి గట్టుకోకు రఘూ! మమ్మల్ని అవస్థలలో పడకుండా కాపాడే బాధ్యత నీది.

రఘు : శాసనాన్ని ధిక్కరించి మీరెక్కడికీ తప్పించుకు పోలేరు. నేను కాస్తంత అచూకీ యిచ్చినా మిమ్మల్ని పోలీసులు ప్రాణాలతో బంధించుకుని తీసుకుపోతారు.

ప్రభ : (దీనంగా) అలా చేయడం నీకు న్యాయమా? ఆనాడు మనము కాలేజీలో చదువుకునే రోజుల్లో నీ ప్రేమను నిరాకరించావన్న కావేషము కడుపులో పెట్టుకుని నా బ్రతుకు బ్రద్దలు చేస్తావా? నీ స్వార్థంకోసం నా జీవితాన్ని నాశనం చేస్తావా? క్షమించి వెళ్ళిపో రఘూ! సురేష్ వస్తే నా బ్రతుకు అగచాట్లపాలౌతుంది. వెళ్ళు రఘూ! నీ పాదాలు పట్టుకొని వేడుకుంటాను.

(పాదాలు పట్టుకుని ఏడుస్తుంది)

రఘు : (హహహ) పాపం కళ్ళు మూసే కలవరింతా, కండ్లు తెరిస్తే గుండెదడ. కారణం! నీ నీలి నీడల మరుగున అగాధమైన గాధ వుంది ప్రభా! అందుకు నీ మెదడులో యోచనలు విషసర్పాలులాగ పడగలు విప్పి బుసలు కొడు తున్నాయి. జాగ్రత్త! నే తలుచుకుంటే మీ ప్రణయి ని ప్రణయుల మధ్య ప్రణయ కలాపాలు. ప్రళయరూపం దాలుస్తాయి! మర్యాదగా నన్ను నీ ....

ప్రభ : రఘు (కోపంగా) అదిమాత్రం నీ వల్లగాదు.

రఘు : మీా యిద్దరి మధ్యా ప్రణయ కోర్కెలు దూరము చేయక పోతె నన్ను మారుపేరుతో పిలు, ప్రభా నువ్వు మృత్యు ముఖం నుండి తప్పించుకోలేవు, నారాయణరావు దారుణ హత్యలో ప్రధాన పాత్ర నీది. అన్నిరోజులు నీ కనుకూలంగా ఉంటాయనుకున్నావు గాని, సాయుధభటుల సంరక్షణలో గౌరవనీయముగా. బంధించబడుతావని కలలోగూడా అనుకోలేదు. విషమ సమస్యలనుండి, ప్రమాదాల నుండి తప్పించుకుంటానికి పారిపోయి, అజ్ఞాతవాసములో ఉన్న పులితోలు కప్పుకున్న పులి ఎప్పుడు పులిని జూచి భయపడుతూనే వుంటుంది. నీ బ్రతుకూ అంతే.

ప్రభ : రఘూ ! యీా దీనురాలి మొరాలకించవూ! నా శీలాన్ని నీ పాదాంకితంజేసి, సురేష్‌కి ద్రోహం చేయలేను. మెరిసేదల్లా బంగార మనుకునే దాన్ననుకున్నావు కదూ, ఎండమావుల్ని ఎంతకాలము వెంటాడినా లాభమేముంది రఘూ ! కాబట్టి నన్ను నీ సోదరిగా తలచి నీ కడుపులో పెట్టుకో, కోరిన డబ్బు ఇస్తాను.

రఘు : (హహహ) డబ్బు నాకిస్తావు. నిన్ను సోదరిగా భావించాలా, నీ డబ్బు ఎవరికి కావాలి ? నాకు కావలసినది నీవు నీ ప్రేమ. రా .... నా మనసారా నా కౌగిలిలోనికి వచ్చి, నా జన్మ సార్ధకం చేయి, రా .... రా .... (అంటూ మీాదకు పోబోవును.)

ప్రభ : రఘూ ! (కోపంగా) నా దగ్గరకు రావడానికి ప్రయత్నించకు దూరంగా వెళ్ళు.

రఘు : ప్రభా ! నువ్వు తప్పించుకుని ఎక్కడికీ పారిపోలేదు. రా, నా బాహు పంజరము లోనికిరా (పట్టుకోబోతాడు)

ప్రభ : ఛీ, నీచుడా ! వదులు, నన్నువదులు, జాలిలేదా !

రఘు : జాలి అనేది ఉంటే యీ దీనుడు యింతగా అర్థించినందుకు అంగీకరించే దానివే.

(బలవంతం చేస్తాడు)

ప్రభ : తప్పించుకుని చేతిబెత్తంతో మోదుతుంది.

రఘు : అబ్బా (అంటూ కూలబడతాడు ప్రభ లోనికి పోతుంది)

(రహీం ప్రవేశం)

రహీం : అమ్మాజీ ! ఏంటీ అమ్మా ఆలా రోప్పాతున్నారు.

ప్రభ : ఏమీలేదు రహీం ఆ రఘూగాడికి తగినశాస్తి నేను చేశాను

రహీం : అమ్మాజీ ! అంతా నాకీ అర్థామయింది. వీడి సంగతి నేను చూస్తా !

ప్రభ : అందువలన చాలా అనార్థాలున్నాయి రహీం ! అతన్నేమనొద్దు, సురేషేడి ?

రహీం : రాత్రికి అక్కడే ఉంటానని చెప్పమన్నారు, అమ్మా !

ప్రభ : అలాగా !

రహీం : ఔను అమ్మా యింతకు రఘూగాడు మిమ్మల్ని ఏదో...

ప్రభ : లేదు రహీం. వాడి ఖర్మ వాడు అనుభవిస్తాడు. రఘు! పో బయటకు ! సురేష్ వస్తే ప్రాణాలతో బయటపడవు. ఇక నుండి అయినా నీతిగా బ్రతుకు !

రఘు : పోతాను. నీ అంతు చూస్తా జ్ఞాపకముంచుకో! నా పగలో భగ్గు భగ్గున మండుతున్న ఒక అగ్నిజ్వాల, పెనునాగు పామై బుసలు గొడుదూ పగవట్టక మానదు. వరి కోరి పగబెట్టుకున్నావు, వస్తా గుడ్ బై. (నిష్క్రమిస్తాడు)

ప్రభ : (భయంతో వణికిపోతూ) వీడు అన్నంతపని చేసితీరుతాడు రహీం

రహీం : వీడికి మీకి సంబంధ మేంటి అమ్మా !

ప్రభ : ఏ సంబంధము లేదు. ఆదికలుపు కోవాలనే ప్రయత్నించి విఫలుడైనాడు.

రహీం : ఏడ్చాడు. మీరు ఆపినార్ లేకపోతే వాడి రక్తాన్ని త్రాగే వాణ్ణి ! బాబుగార్కి చెబుతాను

ప్రభ : వద్దు రహీం, యీ రహస్యం సురేష్‌తో చెబితే నన్ను చంపుకు తిన్నట్టే.

రహీం : సరే అమ్మా ! మీకీ ఎపుడూ కష్టం కలిగించను. (ప్రక్క వేస్తాడు.) అమ్మా ! సురేష్ బాబును పిల్చుకు వస్తాను మీరు విశ్రాంతి తీసుకోండి అమ్మా!

ప్రభ : సరే, సురేష్‌ని తొందరగా పిలుచుకురా,

రహీం : అలాగే అమ్మా ! జాగ్రత్తమ్మ. (నిష్క్రమిస్తాడు.)

(ప్రభ నిద్రపోతూ ఉంటుంది)

[సమయం : రాత్రి పదకొండు గంటలు. అంతా నిశ్శబ్దం బుడ్డిదీపం మాత్రం వెలుగుతూ ఉండును. ముసుగు మనిషి బెదురుతూ, చప్పుడైనపుడు దాక్కుంటు, మళ్ళీ అటుయిటు తిరుగుతూ ఒక మూడు నిముషాలు గడుపుతాడు. చేతిలో బేటరీలైటు వెలుగుతూ వుంటుంది. రంగస్థలమంతా అంధకారంగా వుంటుంది. రంగస్థలానికి ఎదురుగా వాయిద్యాలు భయంకరముగా మ్రోగుతూ ఉంటాయి. నెమ్మదిగా ముసుగు మనిషి ప్రభ మంచము సమీపంగా వస్తాడు. స్పాటులైటు వెలుగుతూ ఆరిపోతూ ఉంటుంది. ఇట్టి పరిస్థితులలో ముసుగు మనిషి కాలికి ఏదో వస్తువు తగిలి చప్పుడౌతుంది, ప్రభ అటునుండి ఇటువైపుకు తిరుగుతుంది. మరొక నిముషము గడుస్తుంది, ముసుగుమనిషి బొడ్డులో నుండి కత్తి తీసి, ప్రభ గుండెలమీద పెట్టి పొడవాలనుకొని, ఏదో మెరుపులాటి ఆలోచన తగిలినట్లుగా నటించి తిరిగి ప్రభను మెల్లగా తట్టుతాడు, ప్రభకు మెలకువ వస్తుంది. కళ్ళువిప్పిచూచి ఒకసారి కెవ్వున కేకపెడుతుంది. ముసుగుమనిషి ప్రభ నోరు మూసి కత్తిచూపించి ]

ముసుగు : అల్లరిచేయడానికి ప్రయత్నించావో యీ కత్తికి ఆహుతి అవుతావు జాగ్రత్త ! (నోరుమూశాడు)

ప్రభ : నీ వెవరివి ?

ముసుగు : దొంగ లోకెల్లా గజదొంగను. మండుతున్న గుండెలతో నిన్ను మటుమాయము చేయడానికి వచ్చిన నీ నీడను !

ప్రభ : అంటే!

ముసు : నిన్ను హతమార్చడానికి వచ్చిన మృత్యుదేవతను.

ప్రభ : అందువలన నీకొచ్చే లాభము ?

ముసు : సురేష్‌తో నీవు లేచి రావడములో నీ కొచ్చిన లాభం !

ప్రభ : అది నేను చెప్పలేను.

ముసు : అయితే ఇదీ నేను చెప్పలేను !

ప్రభ : ఇంతకూ నీ పేరేమి ?

ముసు : గుర్తు తెచ్చుకో !

ప్రభ : ఎప్పుడో విన్న కంఠమువలె ఉంది కానీ గుర్తుకు రావడము లేదు !

ముసు : ఎందుకు గుర్తుకువస్తుంది? అంతులేని కామానికి కట్టుబడి, అగ్నిసాక్షిగా వివాహమాడిన నీ భర్త కండ్లలో దుమ్ము గొట్టి, శీలం చెరుచుకున్నందుకు నిన్ను ముక్కలు ముక్కలుగా చిత్రవధ జేసి కాకులకు గద్దలకు ఎగురవేసినా పాపం లేదు !

ప్రభ : నే నే పాపం తెలిసిచేయలేదు, నా విధినన్ను ఆ మురికి కూపంలోకి త్రోసింది.

ముసు : ఛీ! నీవంటి చీడపురుగు సంఘములో ఉంటే స్త్రీ జాతికే కళంకము.

ప్రభ : నిజమే !

ముసు : కాక అబద్ధమనుకున్నావా? నిశిరాత్రిలో ఏకాంతముగా నిరాయుధంతో నిశ్చింతగా నిద్రిస్తున్న కులటను నిర్దాక్షిణ్యంగా చంపటం పాపమని, ఇష్టము లేక పోయినా కష్టంగా మేల్కొల్పావే కిరాతకురాలా, ఇదుగో చూడవే నా నిజ రూపము !

ప్రభ : ఆ ! ... మీరా ?

ముసు ఔను ! నేనే

ప్రభ : నేను చూస్తుంది కలా లేక నిజమా ?

ముసు : (హహహ) నిజమే ! కాని హత్యచేయబడిన వారు, తిరిగి ప్రాణాలతో ప్రత్యక్షమయ్యేటప్పటికి పిశాచమని భ్రమించి నమ్మలేక పోతున్నావుగదూ !

ప్రభ : మీరు .... జీవించే ఉన్నారా !

ముసు : ఔను, మీ ప్రణయినీ ప్రణయులు చేసిన పొరబాటు వలన ప్రాణాలతో జీవించి ఉన్నానే పతివ్రతా రత్నమా ! మోహాన్ని కప్పిపుచ్చడములో కాటు దేలిన గీటురాయివి కదూ !

ప్రభ : ఆనాటి యవ్వన మదాంధకారము నన్ను అంధురాలిని చేసి పెడదార్లు పట్టించింది. అందుకు .... అందుకు ....

ముసు : అందుకు నిన్నింత తేలికగా చంపను. నీ వగలమారి వడుపులకు నీ వలలో చిక్కేటంతటి హీనుడనుగాను—నిర్భాగ్య

రాలా ? ఆనాడు — ఆ వెన్నెలరాత్రి — ఆ పున్నమ జాబిలి గుర్తుందా ?

ప్రభ : ఉంది — కానీ యిక చెప్పకండి —

ముసు : నాలో రగులుతున్న అగ్ని చల్లారాలంటే జరిగిన యధార్థాన్ని లోకానికి చాటితే కాస్త ఉపశాంతి జరుగుతుంది నీవు ఆ సురేష్ కాదు కాదు, నీ వలపుల రేడు మనసారా మురిపెము మీరా ముద్దులతో, నీ చెక్కిలి చుంబించిన, నీ రహస్య ప్రియునితో కలిసి కుట్రపన్నావు గదూ! నా తల తప్పించడానికి పడగలు విప్పిన నాగుబాములై, నన్ను కాటు వేయడానికి మన ప్రాంగణములో పహరాలు చేశారుగదూ! మరచిపోయావను కుంటాను! మాసి పోయిన సంఘటనలు నీడవలె నిన్ను వెంటాడుతున్నాయి. గతచరిత్ర ఒక్కసారి నెమరు వేసుకో !

ప్రభ : ఆనాటి ప్రతి సంఘటనా కండ్లకు కట్టినట్టుగా గుర్తుకొచ్చి నన్ను కలవరపెడుతూవుంది. ఇక చెప్పకండి, నిజంగా నేను పతితనే, మీకు తీరని ద్రోహం తలపెట్టిన పాపానికి ఫలితం!

ముసు : ఈ కత్తితో ఒక్కపోటు !

ప్రభ : అందుకు సిద్ధంగా ఉన్నాను !

ముసు : కానీ కథ పూర్తి కాకుండా కత్తికి పని కల్పించను ! నీకు నా మీద హృదయంలో ప్రేమ లేకపోయినా నీ కృత్రిమ ప్రేమతో నన్ను పరవశుణ్ణి చేశావు గుర్తుందా!

ప్రభ : ఉంది.

ముసు : బంధము నాది, అనుబంధము వేరొకరిదీ ?

ప్రభ : విధివ్రాత !

ముసు : నిజం కాముకి, కన్ను మిన్నుగానని అంధకారములో మునిగి పాలల్లో కాలకూట విషాన్ని కలిపించి, మన పడక గదికి తెప్పించి త్రాగించావు గదూ !

ప్రభ : ఔను.

ముసు : నా ప్రాణాలు కూడా పోకముందే సర్వము దోచుకుని రాత్రికి రాత్రే పరారయిన దేశదిమ్మరివిగదూ !

ప్రభ : ఔను : అయితే త్రాగిన విషం! ఆశ్చర్యంగావుందే

ముసు : అందులో ఆశ్చర్యమేమి లేదు విను! నేను త్రాగింది విషం గాదు. మధురాతి మధురమయిన చక్కెర పాయసం, తాళికట్టిన భార్యవైన నీకు విశ్వాసం లేక పోయినా మన పనిమనిషి నరసమ్మకు విషముపెట్టి నన్ను చంపమని ధనాశ చూపించావు. యోగ్యురాలయిన నరసమ్మ తన విశ్వాసాన్ని నాకు చూపనే చూపింది, విషానికి బదులు చక్కెర కలిపిన మత్తుమందు పాలల్లో మిళితంచేసి మన పడకగదికి మామూలుగానే అందించింది, అర్థమయిందా?

ప్రభ : నరసమ్మా !

ముసు : ఔను. నరసమ్మ ఇంకా బ్రతికేవుంది.

ప్రభ : అగ్రహించకండి!

ముసు : అయితే అనుగ్రహించ మంటున్నావా! నారాయణ రావన్న నామము నాశనం చేసిన రాక్షసి, పండువంటి పచ్చని సంసారాన్ని రచ్చకీడ్చి, మచ్చతో చిచ్చుబెట్టిన చండాలి, నా హృదయం క్షోభవల్ల అగ్నిపర్వతమువలె బ్రద్దలౌతున్నదే!

ప్రభ : మనసిచ్చి మనస్సు పుచ్చుకున్నట్లు నటించి, మిమ్మల్ని మోసం చేసనందుకు నన్ను చిత్రవధ చేయవచ్చు కానీ, గర్భవతిని ప్రభూ!

ముసు : గర్భవతివా! నీవు దూర సంధు లేదు కాని. నీ మిదకొక డోలా? వంచకి! భయంకరమయిన బల్లెపు పోటయినా సహించ వచ్చును కాని నీవంటి కులటలు కూస్తున్న కూతలు, చేస్తున్న చేతలు, సహించి విడిచిపెట్టరాదు.

ప్రభ : మన్నించండి, ఒక్క దెబ్బకు రెండు పక్షులను ఆహుతి చేస్తారా! నేను అపచారము చేశాను, గాని గర్భము లోని శిశు వేం అపచారం చేసింది?

ముసు : చేసింది, ఆ కళంకాన్ని నిర్మూలించాలంటే నిన్ను నాశనం చేయాలి గదా! లేకుంటే తీరని అవమానాలకు గురౌతుంది,

ప్రభ : ఏముంది చెప్పేది సావధానముగా వినండి. నాకు ప్రాణాలంటే తీపి లేదు. నా ముద్దు ముచ్చటలు తీరిన తరువాత

నేను చేసిన పాప ఫలితంగా మీ పాదములచెంత విశ్చింతగా చావగలను.

ముసు : హా, యిదేటి నా శక్తి క్షణ క్షణానికి దిగజారి పోతుంది. నీ మహోల్లాస సంపద గాంచిన తోడనే ఎక్కడలేని అతీతమైన మమకారము జనించు కొస్తుంది. ఎందుకో నీ వైఖరి చూస్తుంటే నా మనస్సు మంచులాగ చమ్మగిల్లి పోతుంది. చంపలేను ప్రభా చంపలేను.

(తెరవెనుక కంఠము)

1 కంఠము అగు. పెద్ద ధీరునివలె ప్రగల్భాలు పలుకుతూ ఏమగువను నీవు కులటని చంపడానికి ప్రయత్నించావో ఆమె నీ భార్య అన్న మమకారముతో చంపలేక పోతున్నావా! పిరికివాడా, ఏదీ నీ శౌర్యం, ఎక్కడా నీ ప్రతాపం? నీకు ద్రోహం తలపెట్టి కామాంధురాలైన భార్యను ప్రేమానురాగములు త్రెంచుకొని కడతేర్చడముకన్నా కర్తవ్యము వేరెలేదా? వెళ్ళు, ఒక్కపోటుతో చంపి నీకీర్తి ప్రతిష్టలకు భంగము రాకుండా కాపాడుకో!

ముసు : చంపుతాను, ఇప్పుడే చంపుతాను.

2 కంఠము : నీ పరువు ప్రతిష్టల కోసం, రెండు నిండుప్రాణాల్ని బలిగొంటావా! లోకములో నీవు శాంతమునిగా జీవిస్తావా?

ముసు : జీవించను - చంపుతాను - చంపుతాను.

ప్రభ : (కాళ్ళపైబడి ఏడుస్తూ) చంపకండి!

ముసు : ఛీ, ఛనటి, నా పాదములు తాకే అరహత నీకు లేదు. నీ అపవిత్రమయిన హస్తాలతో నా పవిత్రమయిన చరణాలను తాకి నన్ను అపవిత్రుని చేయకు, విడు.

ప్రభ : మన్నించానవండి విడిచిపెడతాను.

ముసు : ఛీ, నీచురాలా, నీలాంటి కులటను ఒక తెను హాత మార్చితే ఇక రానున్న కాలములో కొందరన్నా నీతిగా బ్రతుకుతారు. ఇక నేటితో నీ కులట జీవితం సమాప్తం (అంటూ కత్తి పైకెత్తుతాడు)

ప్రభ : చంపకండి గడువుతీరిన తరువాత నేనే మీ సన్నిధికి వస్తాను.

ముసు : భగవంతుడా! స్త్రీ జాతి ఎంతకయినా తగిందేరా! సరే మాటతప్పవు కదా ?

ప్రభ : తప్పను.

ముసు : అయితే నాకు వాగ్దానం చేయాలి.

ప్రభ : ఏంటది !

ముసు : నీకు పుట్టబోయే సంతానాన్ని ఏ పవిత్రమయిన అనాధ శరణాలయానికో ఒప్పగించి, ఆ జీవితాన్నయినా సంఘంలో గౌరవంగా బ్రతికేలాగ చేయి లేకపోతే వాడు పెరిగి పెద్ద వాడయిన తరువాత, తన తల్లి కులట అని తెలిస్తే వాడు ఎంతగా కుమిలి పోతాడో ఆలోచించుకో? నీ అపవిత్రాన్ని

నీతోనే అంతం చేసుకో. నీకన్న మమకారాన్ని త్రెంచు కుంటానని మాట ఇస్తే నాకదేచాలు. అందుకు నీ కిష్ట మేనా?

ప్రభ : ముమ్మాటికి ఇష్టమే. నేనేమైపోయినా నా సంతానమైనా సుఖపడితే అదే చాలు.

ముసు : సరే, నీకు ఒక సంవత్సరం వ్యవధిస్తున్నాను!

ప్రభ : సంతోషం!

(ఇంతలో బయటనుండి)

సురే : ప్రభా! ప్రభా! (అని పిలుస్తాడు)

ముసు : అదుగో సురేష్ వచ్చాడు. ఎప్పటికయినా నా చేతిలో నీ చావు తప్పదు. జాగ్రత్త! (అంటూ ముసుగు మనిషి పారిపోవును.)

(సురేష్ ప్రవేశము)

(సురేష్ రంగస్థలము మీాదకు వచ్చేటప్పటికి ముసుగు మనిషి పరుగెడుతూ ఉంటాడు ఆ దృశ్యాన్ని సురేష్ చూస్తాడు. ఒక్కసారి నిర్విణ్ణుడైపోతాడు. ఆగు అంటూ ఎలుగెత్తి గంభీరంగా ఒక్క పొలికేక వేస్తాడు. ముసుగు మనిషి ఆ పిలుపులెక్క చేయకుండా వెళ్ళిపోతాడు. అతను వెళ్ళే వైపే సురేష్ పరుగెత్తి అతని జాడ తెలియక నిరాశగా రంగస్థలము మీాదకు వచ్చి చూస్తాడు. ప్రభ కుమిలి కుమిలి ఏడుస్తూ ఉంటుంది. రంగస్థలమంతా విచారంగా కనబడుతు ఒక నిముషము నిశ్శబ్దముగా గడు

స్తుంది. వాయిద్యాలు మాత్రం విచారము గొలుపుతూ మ్రోగుతూ వుంటాయి!)

సురే: (ప్రశాంతముగా సిగరెటు వెలిగిస్తూ) ప్రభా!...ప్రభా!

ప్రభ: (మౌనముతో లోలోన కుమిలిపోతుంది)

సురే: నిన్నె ... ఎవరా మనిషి ?

ప్రభ: (జవాబు చెప్పదు)

సురే: మాటాడవేం! ఎవరాతను ?

ప్రభ: తెలియదు (ముభావంగా జవాబు చెబుతుంది)

సురే: ఓహో, అదా సంగతి! నిష్కల్మషమయిన ప్రేమ పవిత్రమైన ప్రేమ అంటున్న ఆ అంతరంగిక ప్రియుడెవడు!

ప్రభ: సురేష్! అనవసరపు అనుమానాలకు నీ మనస్సులో తావిచ్చి అన్యాయంగా, అభాండం వేయడం పురుష లక్షణము గాదు!

సురే: నోరుముయ్ ఎంతకాలమునుండి యీ నాటకము సాగుతోంది? వూ మాటాడవేం?

ప్రభ: సురేష్ ఆమాట మాత్రం మళ్ళీ అనకు!

సురే: ఎన్నిసార్లయినా అంటాను. నీ భర్తను కానక నన్ను మరిగినట్లు నన్ను కానక వేరొకర్ని మరగడం ఏమంత కష్టమయిన పనిగాదు!

ప్రభ: శివశివ (చెవులు మూసుకుంటుంది)

సురే : ఒక్కసారి రంకునేర్చిన ఆడది, ఎంతమందికయినా, లొంగ డములో తప్పేమున్నదంటావా ?

ప్రభ : అది నీవే తెలియాలి!

సురే : తెలుసు .... ఎవడు వాడు ?

ప్రభ : సురేష్, నిన్నెలా నిమ్మించాలో నా కర్థము కావడము లేదు నాకేపాపం తెలియదు.

సురే : అదిసరే .... నేను నీకేమయినా కీడు తలపెట్టానా ?

ప్రభ : లేదు!

సురే : లేకపోతె ఎందుకింత కుట్రపన్నావు ?

ప్రభ : కుట్రా!

సురే : ఔను, ఆస్తంతా కాజేసి నన్ను చంపడానికి పన్నిన పద్మ వ్యూహంగదూ!

ప్రభ : రామ .... రామ .... ఎంతమాటన్నావు సురేషు ? ఇలా మాట్లాడుతావని కలలో గూడా అనుకోలేదే!

సురే : (జుట్టు పట్టుకుని) ఛీ బయటకు పోవె, రంకులాడి!

ప్రభ : సురేష్ .... సురేష్ ... సురేషు (ఏడుస్తూ నీ పాదాల సాక్షిగా నే-నే పాపం ఎరుగను. నీ ఊహ పెడదారి పట్టిందా ? (కాళ్ళమీదపడును. సురేషు లెక్కచేయక త్రోసివేయును. మళ్ళీ కాళ్ళమీద పడును.)

సురే : చెడుదారి పట్టింది నీవు! నమ్మించి స్వామిద్రోహం చేసింది నీవు! నీవు యే పెడదారి పట్టివుండకపోతే నీ పడకగదిలోకి వచ్చిన మారువేషగాడెవడో నిర్భయంగా నిరూపించే దానివే! (కుర్చీలో కూర్చుని బాధపడుతూ వుంటాడు)

ప్రభ : లేదు సురేష్ లేదు !

సురే : లేకపోవడమేంటి ? నేను చెవులారా విన్నది, కళ్ళారా చూచింది కనికట్టా ? కాదు కనిపించే నిజం!

ప్రభ : కాదు కాదు, నీ నీడజూచి నీవే భయపడుతున్నావు సురేష్

సురే : నోరుముయ్. కల్లబొల్లి మాటలతో కట్టుకథలల్లినంత మాత్రాన్న కవికరించి విడిచిపెడతా ననుకున్నావా? నీవు చేసుకున్న దానికి నీవే అనుభవించు, నిన్ను ప్రాణాలతో విడిచిపెడుతున్నాను. పో బయటకు (త్రోసివేస్తాడు)

ప్రభ : (ఏడుస్తూ) విడిచిపెట్టక్కర్లేదు. ప్రాణాలు తీసినా సహిస్తాను. మనపుట్టబోయె మన పాపసాక్షిగా ప్రమాణంచేసి చెబుతున్నాను. అతనికి నాకు ఎట్టి సంబంధం లేదు.

సురే : దీనికితోడు ఆ కళంకాన్ని కూడా నా కంటగట్టాలని చూస్తున్నావా ? ఇకమీాద నీకూ నాకూ ఎట్టి సంబంధమూ లేదు; పోతావా పోవా ?

ప్రభ : పోతాను .... శాశ్వతముగా నీ నుండి దూరమై పోతాను ప్రస్తుతానికి నేను నిజాన్ని నిరూపించుకో లేక పోవచ్చు.

సురే : కారణం,

ప్రభ : పరిస్థితులు. పరిసరాలు, నా నేరాన్నే నిరూపిస్తున్నాయి!

సురే : కనుక నేను తెలుసుకున్న నీతి ఇదే. క్రోడ్రాన్నైనా నమ్మవచ్చు. నీడనయినా నమ్మవచ్చు, కానీ ఆడదానిని నమ్మి బాగుపడ్డ వాడెవడు? ఇప్పటికైనా మించిపోయింది లేదు. నిర్దోషినిగా నిరూపించుకోవచ్చు. చెప్పు!

ప్రభ : చెబుతాను. చచ్చేముందు యీ ఒక్క మాట మాత్రము చెప్పదల్చాను. లోకం దృష్టిలో నేను పతితనే. కాని నీవు మాత్రము హంతకుడవన్న పేరు మాత్రము తెచ్చుకోవద్దు! నిన్ను ఇంతగా ప్రేమించినందుకు నాకు చివరకు ఇదా ఫలితం!

సురే : రంకులాడికి ప్రేమా? ఆ పదాన్ని ఉచ్చరించడానికి గూడా అర్హురాలివిగాదు. (చావు దుర్మార్గురాలా అని కత్తి గుండెలు మీద పెట్టబోతాడు. రహీం వెనుక నుండి ప్రవేశించి కత్తి లాక్కుంటాడు)

రహీం : సురేషు భాయి, ఏంటి అన్యాయం!

సురే : యు గెటౌటు (కోపంగా)

ప్రభ : యీ విషయంలో నీవేం కలుగజేసుకోవద్దు, ఆ కత్తి ఆయనకే ఇచ్చేయి! సురేషు (ఏడుస్తూ కాళ్ళముందు మోకరిల్లి) నా ముఖం చూస్తుంటే, నీ హృదయం అంత రగులుతూ వుంటే, ఆ కత్తితో నా కంఠములో ఒక్కపోటు పొడిచి, రక్తము చిందించి నీ కసి తీర్చుకో! నా కళంకమయిన దేహాన్ని రుద్రభూమిలో దగ్ధము చేసేటప్పుడు

వచ్చు జ్వాలలు, రక్తజ్వాలలై నన్నూ నా అపవిత్రాన్ని దగ్ధం చేస్తాయి. ఆ రక్తజ్వాల లయినా నిన్ను నమ్మించ కుండా ఉంటాయా ? ఈ పాప పంకిలమయిన జీవిత భారాన్ని మోయలేక, శోకరథ చక్రముల క్రిందబడి, నలిగి పోతున్నాను. (కాళ్ళమీదపడి భోరున ఏడ్చును)

రహీం : సురేషు భాయీ, ఏ టీ, యీ కలాటా ? నిజం నిలకడ మీద తెలుస్తుంది, యీ తప్పు ఒకటి కాయండి !

సురే : రహీం (కోపంగా) ముందు నువ్వు నోరుమూసుకొని పడి ఉండు.

రహీం : ఎంత తప్పు చేస్తున్నారు భాయీ ! మీకీ ఈ వేళ ఇష్టం లేకపోతే ఆమె ఎక్కడిక్కి పోతుంది

సురే : ఏట్లోకి !

ప్రభ : సురేషు,

సురే : పోవె రండులాడి. (కొట్టును)

రహీం : సురేషుభాయి, మాకీముందు ఆమె వంటిమీద దెబ్బ పడింది అంటె మా మనస్సు నొప్పి ఔతుంది.

ప్రభ : రహీం (కోపంగా)

రహీం : జీ అమ్మా ! యీ బద్మాషుని గురించి ఎందుకూ అమ్మా ఏడ్వడం ? పెద్దాబండాకట్టుకుని భావిలో దుమకండి !

సురే : ఒరే రహీంగా. ఏమిరా అన్నావు నా ఉప్పు పులుసు దింటూ నన్నే ధిక్కరిస్తావా ?

రహీం : నీలాంటి నీతిలేనివాడి ఉప్పు పులుసు నోరులేని కుక్కలు కూడా తినవు. బాప్‌రే.బాప్ ఇట్లా కొట్టడాన్కి నీకి ఎట్లా చేతులు వచ్చాయి? కొంపాడీసి చచ్చిపోతే నీది బ్రతుకు పోలీసు వాళ్ళతో రాం రాం హోతుంది. సమయం వచ్చినప్పుడు నీది సంగతి దేఖూ చూస్తాం!

సురే : యు బ్లడీబెగ్గర్ (చంపకాయ కొట్టును.)

రహీం (కోపంగా) బద్మాష్ (మీదకు పోబోవును)

ప్రభ : నాముఖం చూచి అయినా వూరుకోర అయన్నేమన్నా అన్నావంటే నన్ను చంపుకు తిన్నట్లే, వెళ్ళిపో ?

రహీం :- పట్టుబెట్టి నాదిమనస్సుకు గట్టువేసి నారమ్మా

సురే :- రహీం, యీ క్షణం నుండి నిన్ను డిస్మిస్ చేస్తున్నానురా రాస్కెల్ !

రహీం : నీకంటెముందు నేనే రాజీనామా యిస్తున్నాను! నీ దగ్గర నౌఖరీ చేయడముకన్నా ఉరిపోసుకుని చావడం చాలా మంచిది, అచ్ఛా నీ నౌఖరీకి మాకీ రాం రాం. నానౌకరీ తీసినందుకు నామనస్సుకి చాలా ఖుషీ హోతుంది కాని ప్రభా అమ్మాకు అన్యాయం చేయవద్దు

సురే : షటప్ .... యుగెటౌటు .... ప్రభా ఏదీ ఆ నెకేసు ఇలా ఇయ్యి వూ

ప్రభ : (మాట్లాడదు)

సురే : వూ ... త్వరగా

రహీం : (ఏడుస్తూ) యిచ్చేయండి అమ్మా

ప్రభ : సురేష్ నువ్వులేని యీ అలంకరణ నా కెందుకు? తీసుకో
(వణుకుతున్న చేతులతో ఇస్తుంది)

సురే : (తీసుకొని) గుడ్ బై ... వస్తా ... చీరియో

రహీం : ఆమె గతి

సురే : అధోగతే! చీరియో వస్తాను

(పాట శివరంజిని)

సాకీ : అమ్మా తప్పదమ్మా విధివ్రాతా

పాట : తప్పదమ్మా విధీవ్రాతా అనుభవించక తీరదమ్మా,
తప్పదమ్మా విధీవ్రాతా
కన్న తండ్రియె కఠినుడా, కాలసర్పమై కాటువేసెనా.
వలచి ప్రియునికె కతజెందుచూ కాలమంతయూ
కన్నీరేనా ||తప్ప||
నీదు వలపులే కానివలపులై గాలిమేడలై కూలిపోయెనా
బలి అయ్యేదవా బ్రహ్మ రాక్షసికి
ఆకులేని మోడువోలె అడవిగాచిన వెన్నెలేనా ||తప్ప||

( తెర )

[ఓ నాలుగు కుర్చీలు, ఒక సోఫా, ఒక డ్రాయరు, సిగరెటు ఆష్ ట్రే డ్రాయరుమీద ఒక సిగరెట్ టిన్ ఒక రఘు ఫోటో కొన్ని పుస్తకాలు ఒక కలము తెర ఎత్తేటప్పటికి]

(రఘు ఇల్లు :- సురేష్ పిచ్చివాడిలా అటూ ఇటూ తిరుగుతూ అర్ధములేని ఆలోచనలతో తల బ్రద్ధలు గొట్టుకుంటూ వుంటాడు, ఎన్నో సిగరెట్లు కాల్చి పారవేస్తాడు. టైమ్ చూస్తుంటాడు రాత్రి పన్నెండు గంటలు అయివుంటుంది)

(రఘు ప్రవేశిస్తాడు)

రఘు : (సురేష్ వెనుకనుండి వచ్చి) హల్లో గుడ్ నైటు రా బ్రదర్ (చేతిలో మాగ్జయిన్ వుంటుంది)

సురే : గుడ్ నైటు (అని ముక్తసరిగా జవాబు చెప్పి సిగరెటు వెలిగిస్తాడు)

రఘు : నిద్రపట్ట లేదేంటి శివరాత్రి జాగారం చేస్తున్నావు.

సురే : రఘు నామనస్సేమి బాగులేదు. కాస్సేపు నా ఏకాంతానికి అంతరాయము కలిగించకు తరువాత మాటాడుదాం.

రఘు : చికాకుగా వున్నా సంగతేట్రా ! చెప్పకపోయినా వూహించుకో గలనురా. పిట్టకు రెక్కలొచ్చి ఎగిరిపోయిందిరా.

సురే : ఏదో గలాటా జరిగిందని వినే యిక్కడికి వచ్చానురా. గంట క్రితం నువ్వు చెప్పింది అక్షరాలా నిజమయింది.

రఘు : వాట్ అన్నంతపని జరిగిందన్నమాట ! డ్యామ్‌షేమ్ ! భరింపరాని అవమానము, క్షమింపరాని పాపం ? ఆనాడు చెబితే విన్నావా ? ప్రభ నన్ను పవిత్రంగా ప్రేమిస్తుందన్నావే ఏదిరా ఆ పవిత్ర ప్రేమ? అనుభవించు ఇలా చేతులు

మా రే రకాలతో నీకు సాంగత్యము వద్దని నీ తండ్రి మొర పెట్టుకున్నా అవమానించి తుదకు ఆత్మహత్యకు ఆధార భూతుడవయ్యావు, దాని సాంగత్యముతో నీ పరువు, నీ ప్రతిష్ట, నీహోదా, నీ చదువు, నీ సంస్కారము, న్నీ గంగలో కలసిపోయాయి ఒక్క మాటలో చెప్పాలంటే నీ ప్రేయసీ పెద్ద ప్లానులోనే ఉన్నదన్నమాట! ఒప్పుకొంటావా

సురే : ఒప్పుకొనక చేసేదేముంది ? దాని ఖర్మ అదే అనుభవి స్తుంది.

రఘు : ఆమాట చెప్పడానికి సిగ్గులేదూ? ఇంతగా నీ బ్రతుకు బజారుకెక్కించిన దాన్ని ప్రాణాలతో నువ్వు కాబట్టి విడిచి పెట్టావు, నేనైతేనా ?

సురే : ట్రయిను క్రింద తలపెట్టేవాడివా, పౌరుషం పట్టలేక చంప డానికి ఎంత ప్రయత్నించినా చేతులు రాలేదురా!

రఘు ; అయితే నెత్తిన తడిగుడ్డ వేసుకుని ముడమోసి మూల కూర్చొ ఈ మాత్రం దానికి నాతో చెప్పడం దేనికి ?

సురే :- ఇలాంటి సమయంలో ఏదైనా మంచి సలహా ఇస్తావనిరా

రఘు : సలహాలకేం సహస్రం ఇవ్వవచ్చు. సరేగాని అర్జంటుగ నాకు పదివేలు కావాలి, పిక్చరు కంప్లీటుగావలసి వస్తుంది. డిస్ట్రిబ్యూటు చేయగానే నీకెంత డబ్బు కావాలంటె అంత ఇస్తాను, ఏమంటావు - అర్జంటు.

సు.రే : ప్రస్తుతం నాదగ్గర ....

రఘు : లేదంటావు! ఎక్కడయినా నీ పరపతి ఉన్నదగ్గర

సురే : మన బ్రతుక్కి దమ్మిడీ పలుకుబడి లేదంటాను.

రఘు : పోనీ రంగయ్య శెట్టినే మరోపదివేలడుగు

సురే: ఏడ్చినట్లేవుంది. ఇప్పుడు తీసుకున్న దానికే రభసచేస్తున్నా డంటే మరోపది వేలా? యేంచూసిస్తాడు.

రఘు : నీ ఆ స్తిచూచి.

సురే : ప్రస్తుతం మనచేతిలో లేదుగా?

రఘు : ఎలా వుంటుంది నీ తండ్రి చచ్చేవాడు చావక మధ్య ఆ సతీష్ గాణ్ణి ఇరికించాడు.

సురే : ఆ సంగతి నాకు తెల్సు.

రఘు : యేంటి నీకు తెల్సింది? కళ్ళు తెరిస్తే లోకమేంటో అర్ధమవుతుంది. గుమస్తా రామయ్యగాడితో సతీషు కుట్ర పన్నుతున్నాడు! తెలుసా?

సురే : కుట్రా?

రఘు : ఔను! నీ తలరాత తప్పిస్తే ఆస్తంతా తనకే దక్కుతుందని ఆహార్నిశలు కృషి చేస్తున్నాడు

సురే : ఇంత కుట్రా

రఘు : తెలివైన వాడివైతే ప్రాణాలు మీదకు రానున్న యీ ప్రమాదాన్ని తప్పించుకో, తేనెపూసినకత్తులు నీతల తప్పించడానికి ప్రయత్నిస్తున్నాయి. పడగలు విప్పిన పెను నాగు పాములు నిన్ను కాటు వేయడానికి సమయంకోసం వేచి ఉన్నాయి.

సురే : ఇలాగే! అయితే త్వరలోనే వీళ్ళ అంతేంటో తేల్చు కుంటాను.

రఘు : సురేషు, ఆవేశపడి లాభంలేదు యుక్తిగానే పనులు సాధిస్తూ ఎత్తుకు పై ఎత్తు వేయాలి. నినుచూస్తుంటే ఇత రులకు గుండెల్లో గుబ్బాలు పరుగెత్తేటట్లు చేయాలి. ఇటు వంటప్పుడు పిరికితనం లేకుండా ఉపాయం చేత ఎటువంటి అపాయాన్నయినా తప్పించుకోవచ్చు.

సురే : అయితే ఏంచేయాలో తక్షణం చెప్పు

రఘు : ఆ...ఏముంది, ఒకటి ప్రభ! రెండు సతీష్ ఈ రెండు తలలూ (తప్పించమని సౌజ్ఞలో చూపిస్తాడు. చేతిలో సిగ రెట్ కాలు క్రింద వేసి నలుపుతాడు)

సురే : (ఆశ్చర్యంతో గూడిన భయంతో) ఇంపాజ్ బుల్! అప్సర్డు! వెరీడేంజరస్ ప్రాబ్లమ్. నావల్లగాదు నీ సలహాల కొక నమస్కారం. (నమస్కారం పెడతూ లేస్తాడు)

రఘు : వృత్తి పిరికివాడి వనుకోలేదు. నాకు తెలిసిన సలహా ఏదో చెప్పాను, పాటిస్తే ఫలితం దక్కవచ్చు. లేకపోతె నీ ఖర్మం సురేష్. నాతో చేతులు గలపాలని చూస్తు న్నావా ?

సురే : సందేహం దేనికి బ్రదర్ ?

రఘు : అయితే విను, నీకడ్డువచ్చిన వాళ్ళనందర్ని మాత మార్చాలి.

సురే : సర్టెన్లీ !

రఘు : కావలసివ ఆ సి సేకరించాలంటే కనీసం ప్రాణాలకైనా వెనుదీయగూడదు.

సురే : ఐ యామ్ రెడీ.

రఘు : పట్టినపట్టు విడువరాదు అన్నమాట నిల్పుకోవాలి! అంతు తేల్చుకోవాలి! (బల్ల గుద్దుతాడు)

సురే : ఎవ్వర్ రెడీ ఆల్ రైట్. యింత ధైర్య మిచ్చినందుకు నీకు థాంక్సురా ప్రదరు!

రఘు : మనప్లాను నాకు నీకు దప్ప మరెవ్వరికి తెలియగూడదు. తెలిసిందా మన వ్యూహాలన్ని పేకమేడల్లా కూలిపోతాయి ఇందులో ఆంతర్యం అసలు స్వరూపం శత్రుకూటంలోని వారికి కంటక ప్రాయంగా ఉంటుంది.

సురే : అందుకు తగిన ఏర్పాటులు ?

రఘు : తక్షణం చేయిద్దాం.

సురే : ఇందులో ఏమాత్రమయినా పొరపాటు జరిగిందంటే ముందు మనం.

రఘు : ఉరికంబానికి ఎక్కాలంటావు ? ఆల్ రైట్, ఓ పదివేలు పారేస్తే పోలా ? కార్యరంగంలోనికిది గాక జయాపజయాలు తప్పవు గదా సురేష్.

(సుబ్బన్న ప్రవేశము)

(వచ్చి రగుకాళ్ళమీద పడతాడు, మాసినగడ్డం చేతికి రిష్టు లైసెన్సు, చిరిగిన చొక్కా, కాకినిక్కరు, వేసుకుంటాడు)

సుబ్బ : (ఏడుస్తూ) బాబుగారూ .... బాబుగారూ!

రగు : యేంజరిగిందిరా సుబ్బా ?

సుబ్బ : నా పెళ్ళాం, యివ్వాళకు పదిరోజులనుండి మంచాన్నపడి మరణానికి సిద్ధంగా ఉంది. (యేడుస్తూ)

సురే : అలాగా ?

రగు : పాపం జ్వరమా?

సుబ్బ : ఔను బాబూ, యీవేళ పొద్దున్నుండి మూసినకన్ను తెరువ లేదు, పరాకుమాటలు మాట్లాడుతుంది, ఏమో తుందో ఏమో !

రగు : ఎవ్వరైనా మంచి డాక్టరుకు చూపించలేక పోయావా ?

సుబ్బ : డాక్టరు .... ఎందుకొచ్చిన డాక్టర్లు. డబ్బుంటేగాని డాక్టరు గుమ్మం త్రొక్కొద్దన్నాడు. కట్టుబట్టలు తప్పించి కనీసము తాళిబొట్టయినా లేకుండా, అంతా దాని మందు లకే ఖర్చుపెట్టాను. డాక్టరు యాభైరూపాయల మందులు వ్రాసి ఇచ్చాడు వాటిని అరగంటలో తేలేకపోతె కుటుం బమే కూలిపోతుంది బాబూ.

సురే : యాభైరూపాయలా ? ఎవర్నన్నా అడుగలేక పోయావా?

సుబ్బన్న : అడగరాని వాళ్ళనందర్ని అడిగాను, పట్టరాని వాళ్ళం దరి కాళ్ళు పట్టాను. అందరూ నన్ను రౌడీ వెధవా, పో అని చీదరించుకున్నారు బాబూ.

రఘు : ఒరే రాస్కేల్, నీ దోపిడీలు, దొంగతనాలు, నీవు చేసిన ఖూనీలు మరచి పోయావా ? అందుకనే నిన్నుచూచి చీద రించు కున్నారు !

సుబ్బ : లేదుబాబు లేదు, దొంగతనాలు మానేశాను. కష్టపడి రిక్షాత్రొక్కుకుని బ్రతుకుతున్నాను బాబుగారు.

రగు : అయితే బుద్ధిమంతుడవయ్యా వన్నమాట! అనవసర మప్పుడు దొంగతనాలు చేసి కావలసినంత డబ్బు సంపాదించినావు. నీ పెళ్ళాం చావుబ్రతుకులలో ఉంటే ఇప్పుడెందుకు చేయగూడదురా!

సుబ్బ : అయినా యిష్టంలేదు బాబు, ఇటువంటి సమయములో ఆ సాయం మీరు చేస్తారని!

రగు : నేనా?

సుబ్బ :- ఔనుబాబూ, నా ఆడదికాస్త కళ్ళు మూసిందంటే నా పిల్లలు దిక్కులేని వారౌతారు. ఐదుగురు ఆడపిల్లలు, ఆరోనెల చంటోడు, వీళ్ళందర్ని సాకాలంటే అదిబ్రతికే ఉండాలి, అదిపోతే నాయిల్లే నరకమౌతుంది. రగుబాబు, బ్రతికినన్నాళ్ళు మీ పాదాలు తుడుచుకుంటాను. ఈ ఒక్క సహాయాన్ని చేయండి. నా ఇంటికి దీపం పెట్టిన వారౌతారు!

రగు : సురేషు, వీడు ఇదివరకెన్నోసార్లు యిలా మోసంచేసి చాలా డబ్బు పట్టుకెళ్ళాడు.

సురే : అయితే ఇదంతా హంబక్కన్నమాట.

సుబ్బ : కాదుబాబూ! యిప్పటి విషయం మాత్రం నిజం.

రగు : అని మాకు నమ్మకమేంటోయ్?

సుబ్బ : తమ పాదాలు సాక్షిగా నమ్మండి బాబూ ! దాన్ని బ్రతికించి నన్ను చంపండి! ఒక్క యీ రూపాయలిస్తే చావులో గూడా బ్రతికించిన వారౌతారు.

రఘు : నువ్వడిగినట్లు డబ్బు మేము ఇస్తామె అనుకో. దానివలన మాకొరిగేదేటి ?

సుబ్బ : దానికి ప్రతిఫలంగా నా వలన జరిగేదేమున్నావుంటే చెప్పండి చిటికలో చేస్తాను !

రఘు : నీ ముఖం, కండబలమేగాని గుండెధైర్య మెక్కడిదిరా నీకు ? నువ్వేం చేయలేవు.

సుబ్బ : చేస్తాను బాబూ నా పెళ్ళాంకోసం నిప్పులలో దూకమన్నా దూకుతాను

సురే : అంత ధైర్యముందా ?

సుబ్బ : ఉన్నా లేకపోయినా పరిస్థితులే ఆసాహసానికి పురిగొలుపుతున్నాయి. ప్రపంచములో నాలాంటి దౌర్భాగ్యుడు నీతిగా బ్రతుకుదామన్నా, నన్నావరించిన దుష్టశక్తులు తిరిగి ఆ మురికి కూపంలోనికి ఈడ్చుకుపోతూ ఉన్నాయి ఏం చేయాలో చెప్పండి ?

రఘు : ఇద్దరిని నామరూపాలు లేకుండా నాశనంచేయాలి.

సుబ్బ : చేస్తాను (పిడికిలి నలుపుతూ) నా పెళ్ళాం బ్రతకాలంటే రెండు నిండు ప్రాణాల్ని బలి ఇవ్వాలన్నమాట ? ఇస్తాను

డానికోసం ఏమైనా చేస్తాను, చెప్పండి బాబూ ఎవర్ని ?

రఘు : (హా హా హా) వీళ్ళ అన్న సతీష్‌ని, ఇతని ప్రేయసి ప్రభావతిని (హాహాహా)

సుబ్బ : ఆ ... (దీనంగా) ఈ ముసురు ముంచుకు రావడం నా కొంప దీయడానికే! దేవుడులాంటి ఆ సతీష్ బాబుని, ఈయన్ను నమ్ముకున్న ప్రభ అమ్మగారిని చంపడానికి నాకు చేతులురావు బాబు! అయినా మీకెందుకు పుట్టింది ఈ దుర్బుద్ధి ?

రఘు : (హాహాహా) నీ సానుభూతికి, నీ దయార్ద్ర హృదయానికి అభినందనలురా, రాస్కెల్ (కోపంగా) ఆ ధర్మపన్నాలన్ని మా కిట్రా నేర్పేది. మర్యాదగా ఆ పని పూర్తిజేశావా మంచిది, లేదా గడపదాటి బయటకు గూడా వెళ్ళవు!

సురే : బాగా ఆలోచించుకోరా సుబ్బా!

రఘు : ఒక వేళ పనిపూర్తిచేసినా బయటకు పొక్కిందంటే నీ వంశము నాశనము చేస్తాం!

సురే : మాదీ ... త్రాచుపాము పగ !

రఘు : మా కెదురాడితే మంచినీళ్ళుకూడా పుట్టవు ?

సురే : అందుకు నీ సమాధానం ?

సుబ్బ : మీ ఆజ్ఞ పాటించడానికి సిద్ధంగా ఉన్నాను. త్వరగా ఇవ్వండి బాబూ పైకం!

రఘు : అయితే మా నిబంధన లన్నింటికి ఒడంబడిక పడినట్లేనా !

సుబ్బ : పరమాత్ముడిమీద బట్టేస్తున్నాను. ఇప్పుడు పడుతున్న కష్టాలు చాలు, ఇంకా అబద్ధాలెందుకు బాబూ చెప్పడం వలినవారి ఆజ్ఞ గీచిన గీటు జవదాటకుండా పాటిస్తాను.

రఘు : ఈ కబుర్లకేంగాని పని పూర్తిచేయకుండా తప్పించు కున్నావా ?

సురే : ప్రాణాలు తీస్తాం, వాళ్ళ ఇద్దరికి బదులు ముందు నీ ప్రాణాలు తీస్తాం.

రగు : పని జరిపావా, నీ వడిగిన యాభైరూపాయలే గాదు.

సురే : మూడు వేల రూపాయలు దాకా ముట్టచెబుతాం.

రగు : ఇప్పటికి యీ రెండువందలు పట్టుకుని వెళ్ళు, మిగిలింది పని పూర్తి అయ్యాక.

(సుబ్బన్న నోట్లకట్ట అందుకుంటాడు)

(రంగయ్యశెట్టి ప్రవేశం)

సురే : రండి రంగయ్యగారూ బహుకాల దర్శనాలు, కూర్చోండి. (కుర్చీ చూపును.)

రంగ : ( ర్చొని) సురేష్ బాబూ ?

సురే : ఏంటండి, రంగయ్యగారూ !

రంగ : మరి నా బాకీ విషయం !

సురే : ఆగినన్నాళ్ళు ఆగారు, యీ రెండు రోజులు ఓపిక పడితే మొత్తం ఇచ్చేస్తాను !

రగు ఇవ్వవలసిందెంత ?

రంగ : పదివేలకు పైగా !

రగు : ఓస్, ఇంతేనా !

రంగ : ఆ ... ! యీ మాత్రము దానికే పిల్లి సముద్రాదాకా ఎలుకయినాకా, అనికాలం గడుపుతూ వున్నారు ! నేనవతల రకం త్రిప్పుకో వద్దూ ! నువ్వే చెప్పు రాఘవయ్యా!

సురే : నిజమే ననుకోండి, నా మాట విని యీ రెండు రోజులు ఆగారంటే పదివేలకు ఇరవైవేలు ముట్టచెబుతాం

రంగ :- ఇస్తాం ఇస్తాం అని ఎగనామంపెడితే చివరికి కోర్టు కెక్కాల్సొస్తుంది, ఇక మీ ఇష్టం, మీకిదివరకే చెప్పాను

రఘు :- అంతదూరం వెళ్ళకండి. మీకా భయం అక్కర్లేదని ఆ హామీ నేనిస్తున్నాను.

రంగ : సరే ఇదీ చూద్దాం. మరి ఇంటి అద్దె మాటో

సురే : నాకేం సంబంధం లేదు!

రంగ : అయితే ఆవిడగారిని, అరక్షణంగూడా నా కొంపలో ఉంచేది లేదు.

సురేష్ : ఉంచక్కర్లా మెడపట్టి బయటకు గెంటండి లేదంటే, స్మశానానికి దారి చూపండి.

రంగ : బలేబాగా చెబుతున్నారు. నిజంగానా, వేళాకోళానికా!

ఘు : నిజమే ఆమెకు వీడికి, సంబంధం తెగిపోయింది.

రంగ : అలాగా, అయితే యిప్పుడే వెళతా! వస్తాబాబూ వస్తా ... (కొంతదూరం వెళ్ళి) (స్వగతం) ఔను, ఇలాంటి వాళ్ళకు డబ్బు ఎదురుపెట్టి. ఇల్లు అద్దెకివ్వడం, నాదే తప్పు. (చంపలు వేసుకుని నిష్క్రమిస్తాడు.)

(ఇద్దరూ నవ్వు కుంటారు.)

సురే : మధ్య వీడొకడూ పానకంలో పుడకలాగ (ఇద్దరూ నవ్వు కుంటారు.)

రఘు : సురేగాని ఇలా షైరుగా పోదాంపద, కాస్త మనశ్శాంతి అవుతుంది,

సురే : రైటో పదా (నిష్క్రమిస్తారు)

( తెర )

(ప్రభ ఇల్లు తెర ఎత్తేటప్పటికి ప్రభ విచారంగా పాట పాడుతూ ఉంటుంది. షబ్నమ్ చిత్రములో "ఆయీ ఆయీ రాత్ స్వహాని సున లేఖుషీకి కహాని" అను వరుస)

రావా, రావా ఓ చందమామా
వినవా విషాదా గాథా
కనవా కన్నీటి గాథా
మదిలో నీరవగచాను మగని వియోగం
పలుమారు తలచాను ప్రియునీ సంయోగం ఆ ఆ ఆ ఆ ఆ
లోకులందరు, కాకులవలెను
నను చూచి నవ్వేదష రాజా
వినవోయి వెన్నెలరాజా ॥రావా రావా॥

(2) నలరాజా నా ప్రియుడు, నను జేర రాడూ
అలనాటి మా కథలు వ్యథలాయె నేడూ
వ్యథలాయె నేడూ ఊ ఊ ఊ ఊ ఊ
నా ఆశలన్ని అడియాశ లై తే
కన్నీటి కలలాను బ్రతుకూ
నడివీధి పాలాను నేడూ ॥రా॥

(3) తారలతోటి తారాటలాడే
కలువలరాజా కనికరము లేదా
కనికరము లేదా ॥ఆ ఆ ఆ॥
ఏపాప మెరుగని నాకీ జగానా
నీలాపనిందను బాపా
నీవైనా నిజమును ఎరిగింపా ॥రావా రావా॥

(4) వినువీధిలోను విహరించె రాజా
విధికి బలిఅయితి జాబిల్లినే జాబిల్లినే
రగిలేటి నామదిలో రేరాజు నీవు
రక్షింప రావేల నేడూ రయమున చుక్కల రేడూ ॥రా వా॥

ప్రభ ఇల్లు

(రంగస్థల అలంకరణంతా మామూలుగానే వుంటుంది. తెర ఎత్తేటప్పటికి ప్రభ పాట పాడుతూ ఉంటుంది. రహీం ఒక టిఫెను క్యారియరు తెచ్చి బల్లమీద వుంచి ప్రభను పలకరించడము ఎలాగా అని ఆలోచిస్తూ ఉంటాడు. ప్రభ తల రేగి నలిగిన, వస్త్ర

ధారణతో శుష్కించిన ఆకారముగా కన్పిస్తుంది పాట ఆఖరు అయ్యే సమయములో రహీం దీనంగా)

రహీం : ప్రభా అమ్మా, ప్రభా అమ్మా ! (పిలుస్తాడు)

ప్రభ : వచ్చావా రహీం : (ఏడుస్తూ)

రహీం : జీ అమ్మా కళ్ళు (చెమ్మగిల్లుతాయి దీనంగా)

ప్రభ : సురేష్ కన్పించలేదా ?

రహీం : కన్పించాడు అమ్మా !

ప్రభ : ఏమన్నాడు (ఆతృతగా)

రహీం : మీకీ గంగలోపడి చావమన్నాడు (చెప్పలేక చెపుతాడు.)

ప్రభ : ఆ ! అంతమాటన్నాడా !

రహీం : అవడం ఏమిటమ్మా అసలు మీది పేరు వినితేనే అంగార్ అంగార్ అయిపోతున్నాడు.

ప్రభ: ఆ ! అంత చేయరాని అపచారం ఏంచేశాను .... ఇదంతా నా ఖర్మ.

రహీం : లేకపోతే ఏంటి అమ్మా ? అటు కట్టుకున్నవారికి ఇటు సురేష్‌కి యిద్దరికూ చెడినారు. మీ నశీబ్ కి పట్టాయి ఖరాబ్ రోజులు. జరిగిందేదో జరిగిపోయింది, చింతా చేసి లాభం ఏంటి అమ్మా.

ప్రభ : అంతే అంటావా రహీం !

రహీం : అక్షరాలా అంతే అమ్మా! నేను ఒక్కమాట చెబు తాను వింటారా?

ప్రభ : చెప్పు రహీం.

రహీం : ఇంక (ఉద్రేకంలో) ఆ హారామ్‌గాడికి మరచిపోండి అమ్మా.

ప్రభ : రహీం (ఉద్రేకంగా) నాకిచ్చే సలహా యిదేనా?

రహీం : ఔను అమ్మా! ఇంక మీకు ఎందుకూ అమ్మా పిచ్చి భ్రాంతి, ఆ బద్మాష్ మిమ్మల్ని ఎప్పుడో మరచిపోయాడు

ప్రభ : ఎప్పటికీ మరచిపోడు.

రహీం : అదే నిజమైతే ఇప్పటికి పదిరోజుల్ పై మీ గుమ్మానికి ఎందుకు త్రొక్కి ఉండడు? నాకే హుకుం ఉంటే వాణ్ణి కోడిని జిబా చేసినట్లు కత్తితో ఖైమా చేసి ఉండేవాణ్ణి!

ప్రభ : ఆవేశపడకు రహీం, నా ముఖం చూచి అయినా శాంతించు.

రహీం : ఎంతకాలం శాంతానికి చెబుతారు? యిలా మనం నోట గుడ్డలు పెట్టుకుని కూర్చుంటే వాడి పాపాలకు అంతూ దరి ఉండదు! నేను జాతికి తురకా అయినా నీతికి మసలుతాం.

ప్రభ : ఆ సంగతి నాకు తెలుసు

రహీం : కానీ వాడికి తెలియదు, మీ ఘోడు చూడలేక పది రోజుల నే తిరిగి తిరిగి కాళ్ళు బలపాలు కట్టాయి చూడండి అమ్మా!

ప్రభ : ఔను. నా గురించి చాలా కష్టపడుతున్నావు రహీం!

రహీం : తిరుగుతున్నందుకు నాకూ ఏమీ బాధ లేదమ్మా!

ప్రభ : మరి!

రహీం : సండుల్ గొందుల్, హోటల్ గీటల్, అన్నీ తిరిగి అలసీ పోయి, ఆఖర్కు పార్కు హోటల్ మె పట్టుకుని మీది సంగతి తేల్చమని కాళ్ళు వేళ్ళుపడితే కళ్ళు ఎర్రజేసి కత్తి చూపించి చంపుతా నంటాడు.

ప్రభ : ఆ, కత్తి చూపించాడా!

రహీం : ఔను అమ్మా. ఇంక నా మంచితనము అంతా మంట గలసి పోయింది. ఇంతవర్కు మీది ముఖం చూసి ఊరు కున్నాం లేకపోతె మక్కా మసీద్ మే దిక్కులుకు చూపించే వాళ్ళం.

ప్రభ : సురేషుని, నా ఎదుట నిందిస్తే నా నవనాడులు క్రుంగి పోతున్నాయి.

రహీం : ఏమన్నా కానివ్వండి. అతని పేరు నా ఎదుట ఎత్తితే నా వళ్ళూ మండీ పోతుంది!

ప్రభ : ఆ కోపపడకు రహీం. కడసారిగా నన్ను ఒకసారి సురేష్ దగ్గరకు తీసుకొని వెళ్ళవు.

రహీం : (చంపలు వేసుకుంటూ) తోబాతో బాహాయ్ హామ్‌సిగ్గు ఎరుగనమ్మ పిల్లని సంకా పెట్టుకుని మొగుడి పెళ్ళికి వెళ్ళి

నట్లు ఏ ముఖం పెట్టుకుని, అక్కడికి వెళ్ళుతారు? చూడండి అమ్మా చేతుల్కి కాలాకా అకుల్కి పట్టుకుంటె ఏమిటీ లాభం? అసలు మీరు ఎదురుపడితే బ్రతుక నివ్వడు!

ప్రభ : అంతకన్నా నాకు కావలసిందేముంది? వెళ్ళివద్దాం రా!

రహీం : చేతులారా. చావు కోరుకుంటున్నారు. మీది వేలుతోటే మీదీ కళ్ళు పొడుచుకుంటున్నారు. మీరు వెళ్ళండి అమ్మా, నేను రావటానికి వీలు లేదు.

ప్రభ : రావా రహీం!

రహీం : నేను రానూ అమ్మా! వాడిపై జన్మజన్మాలకు కక్ష కడుతాం.

ప్రభ : వద్దు రహీం! ఎప్పటికయినా మళ్ళీ కలుసుకోలేక పోతామా?

రహీం : ప్రభా అమ్మా, మాటలు సందడిమె మనువూ మరచీనట్లు నాల్గురోజుల్ సె ఖానా పీనా లేకుండా మంచాన్నపడి మర ణానికి తయ్యార్. అయినారు, హోటలు సే ఖానా తెచ్చాన్ కొంచం తినండి అమ్మా.

ప్రభ : సురేష్కి దూరమయిన నా నోటికి ఎలా సహిస్తుంది, తిన లేను రహీం!

రహీం : అమ్మాజీ, మీకోసం గాకపోయిన మీ కడుపులో శిశువు కోసం తినండి అమ్మా.

ప్రభ : నా బ్రతుక్కితోడు మళ్ళీ యిదొకటి !

రహీం :- అంతమాట అనకండి అమ్మా, అది అల్లాహుకం వినండి అమ్మా,

ప్రభ : అబ్బా వేధించకు రహీం ! కాస్సేపు నా యేకాంతానికి అడ్డురాకు,

రహీం : నన్ను నామాట హిసాబ్ చేయకపోతే యింక నాముఖం గూడా మీకి చూపించన్, వస్తా (వెళ్ళబోతాడు)

ప్రభ : రహీం, అయితే నన్ను విడిచి వెళ్ళిపోతావా? యే ఆశతో ఇంతవరకూ జీవించుతున్నానో ఆ ఆశ తీరలేదు సరిగదా నీవుగూడా విడిచి నన్ను యే కాకిని చేసి వెలితే నాగతేం కావాలి.

రహీం : లేకపోతే యేమిటీ అమ్మా ! మీరు పట్టిన కుందేలుకు, మూడేకాళ్ళు చెబుతారు వినండి అమ్మా !

ప్రభ : తప్పక వింటాను. నీ మనస్సు నొప్పించుకోవద్దు (కలిపి ముద్దచేసి తినబోతూవుండగా మంచినీళ్ళకై రహీం లోనికి వెళ్ళుతాడు. రంగయ్య శెట్టి ప్రవేసిస్తాడు,)

(రంగయ్య ప్రవేశం)

రంగ : ప్రభాదేవిగారూ, ప్రభాదేవిగారూ

ప్రభ : (కుర్చీ చూపించి) దయచేయండి

రంగ : దయకేం కావలసినంత ఉంది. మరి నా అద్దె మాట ...

ప్రభ : ఇస్తాను శెట్టిగారూ, ఆయన ఇంటికి రావడం లేదు.

రంగ : పాపం జు జు జు రావడం లేదు కాబట్టి, అడుగుతున్నాను ఇక రాడనికూడా అడుగుతున్నాను.

ప్రభ : ఆయన తప్పకుండ వస్తారు.

రంగ : వస్తారో, చస్తారో ముందు డబ్బుకట్టి మాట్లాడండి.

ప్రభ : ఈ పరిస్థితులలో ఎక్కడనుంచి తెచ్చి యీయగలను.

రంగ : పరిస్థితులు బాగు లేని వాళ్ళకు ఇల్లు ఎందుకమ్మా ? నాకు అనా పైసలతో అద్దె కట్టి తక్షణం ఇల్లు ఖాళీచేయండి, లేకపోతే మంచం కంచం బిందె తపాళాలు బయటపారేసి వేలం వేయించి శంకరగిరి మాన్యాలు పట్టిస్తాను.

(రహీం ప్రవేశము )

రహీం : అరె శెట్టియ్యారు, నీకు అద్దె మొత్తం ఎంత ఈయాలి ?

రంగ ; నూటయాభై.

రహీం : నీకు యీయవలసింది వందరూపాయలు గదా! అల్లామీద వట్టూతిని చెప్పు,

రంగ : సత్య ప్రమాణకంగా నాకు యీయవలసింది నూటయాభై. కావాలంటే గుళ్ళోదీపం ఆర్పేస్తాను.

రహీం : దీపం ఆర్పటంకాదూ ఛే. సైతాన్ కొంపల్కి ఆర్పుతావ్

రంగ : నీకంత రోసముంటే ముందు నా అద్దె డబ్బుకక్కించు. నాది కష్టార్జితం, ఏంటనుకున్నావో.

రహీం : మాద్ రే బేటా మాచ్, నీది బ్రతుకూ అంతా నాకీ తెల్సు వడ్డీల్కి వడ్డీలుచేసి, నమ్మినవార్కి బూరాగొరిగీ

వేస్తున్నావు లేదూ ?

రంగ : నువ్వూ తగ్గరా మగడా, మర్యాదగా అద్దె ఇస్తే మంచిదే లేకపోతే సాయంత్రానికి ఇల్లు ఖాళీచేయండి.

ప్రభ : భగవంతుడా ఇది ఒక పరీక్షా! రహీం, ఇప్పుడేంటి చేయడం ?

రహీం : అదేనమ్మా నేనూ ఆలోచిస్తున్నాను, సరే ఉండండి అమ్మా (అంటూ లోనికిపోతాడు)

రంగ : త్వరగా రావయ్యా.

(రహీం చీదరగా కళ్ళు ఎర్రజేసి చూస్తూ వెళ్ళిపోతుడు) కొన్ని నిముషాలపాటు రంగస్థలమంతా నిశ్శబ్ధంగా ఉంటుంది, రహీం కొంత పైకంతో ప్రవేశిస్తాడు.)

రహీం : నా దగ్గర యీ పైకం ఉంది. ఇచ్చి వాడిపీడ వదలించుకోండి అమ్మా

ప్రభ : రహీం (దీనంగా) నేను నీకు యీయవలసింది నీవు నాకా ఇచ్చేది ?

రహీం : పర్వాలేదు అమ్మా, మీలాంటి వారి ఉప్పుపులుసూ తింటూ పెంచిన కండలు ఇవి. జీవితంలో నేను చేస్తున్న గొప్ప పని ఇదే. ఇప్పుడు యజమానిరాలికి కష్టం వచ్చిందీ అంటే సర్దుకోలేని నా బ్రతుకూ ఎందుకూ అమ్మా ? శెట్టి ఇవిగో యాభై రూపాయలు

రంగ : మరి మిగిలినవెయ్యా

రహీం : పదిరోజులు మే ఇస్తాం

రంగ : మీరిచ్చారు, నేను పుచ్చుకున్నాను. రంగయ్య శెట్టంటే అల్లాటప్పయ్య గోంగూర పచ్చడనుకొన్నావా ఏంటి ఈ పప్పులేని మన దగ్గరేం ఉడకవు.

రహీం : అయితే నీదిపప్పుల్ మా దగ్గరవుడుకుతాయ్ ఖబడ్దార్ ఛే బద్మాష్

రంగ : నీతోటి నాకేటిగాని, ఏమమ్మా యేసన్నా న్యాయంగా ఉందా అంటా ఓడెక్కేదాకా ఓడమల్లయ్యా, ఓడదిగి నాకా బోడిమల్లయ్యానా! యిద్వేవమ్మా డబ్బా?

రహీం : అరె శెట్టియ్యారు, ఆమెతో కాదు నాతో మాట్లాడు. తీసుకుంటావా తీసుకోవా?

రంగ : తీసుకోనోయ్, ఇస్తే అంతా యీయండి లేకపోతే గట్టి ప్లీడర్ని పెట్టి దమ్మిడీ పైసలుతో కక్కిస్తాను.

రహీం : తీస్కుంటే తీస్కో, లేకపోతే కోర్టులో దావా వేస్కో.

రంగ : వేసుకుంటా వేసుకుంటా, న్రి ముకాల్లారా బాకీవుండి, నన్నే అన్యాయం చేయాలని చూస్తున్నారా? ముప్ప తిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రాగించకపోతే నా పేరు వాడకట్టు రంగయ్యేగాదు, చూడు నా తడాకా, (నిష్క్రమిస్తాడు)

రహీం : జారే. జా భే జా.

(ఇంతలో తెరలో గావుకేక వినిపిస్తుంది.)

ప్రభ : రహీం ఏంటా కేక ?

రహీం : బయట ఏదో గలాటా జరుగుతుంది అమ్మా, వెళ్ళివస్తా

ప్రభ : త్వరగా వెళ్ళు రహీం !

రహీం : అలాగే నిష్క్రమిస్తాడు)

(కొంతసేపు గడచిన తరువాత)

ప్రభ : ఏంటి రహీం. ఆ కల్లోలం ?

రహీం : ఏం చెప్పనూ అమ్మా, సతీష్ బాబుని చంపమని సురేష్ లంచమిచ్చి సుబ్బన్నను తోలిన్యార్. ఎవరో ముసుగు మనిషి అంటా అమ్మా ?

ప్రభ : ముసుగు మనిషా ?

రహీం : ఆయన మీకు తెలుసా !

ప్రభ : తెలియదు. ఏం అయన్ను కొట్టారా ?

రహీం : ఆయనే సుబ్బన్నగాడ్కి తుక్కు తుక్కు చేసి వెము కలు విరుగబొడిచి పంపినాడ్, యిది ఎంతా అన్యాయము అమ్మా !

ప్రభ ! ఔను ఆస్తికోసం సురేష్ అన్నగారన్న మమకార మయినా లేకుండా యీ నీచకార్యానికి పూనుకున్నాడా?

రహీం : ఎంతో ఘోరకల్లు చేస్తున్నా యిది అంతా చూస్తుంటే ఏదో ముప్పాకే జరుగుతుంది.

ప్రభ : నిజంగానే

రహిం : యిప్పటికయినా తెలుసుకున్నారుగా! చేసుకున్న వారికి చేసుకున్నంత చాలారాత్రి అయింది తిని పడుకోండి అమ్మా.

ప్రభ : గదిలో తింటాలే.

రహి : సరే పదండి (అంటూ క్యారియరు లోనికి తీసుకుని వెళుతాడు)

(తెర)

రఘు ఇల్లు

(అంతా మామూలు ముందు మాదిరిగానే ఉంటుంది సురేష్ రఘులు ఒక టేబులుకు ఎదురెదురుగా కుర్చీలలో కూర్చొని బ్రాందీ త్రాగడం ముగించి సిగరెట్లు వెలిగించి సుశి ఆష్ ట్రేలో నింపుతూ, నవ్వుతూ వుండగా, తెర లేస్తుంది, యిద్దరు మంచి విలువైన దుస్తులలో వుంటారు. ఎదురుగా గడియారం ఉంటుంది)

రఘు : (టయిం చూచి) ఇప్పటికి మనము చెప్పినట్లుగా పని పూర్తి చేసి ఉంటాడు.

సురే : అయితే నేటితో మన శత్రుబాధ నివారణ అయినట్లే ఇక ఆ స్థిపై సర్వాధికారాలు మనవే!

రఘు : నిజం, నిజం.

(సుబ్బన్న ప్రవేశం)

సుబ్బ : బాబూ, రఘువయ్య బాబూ

రఘు : పని పూర్తియిందిరా సుబ్బా ?

సుబ్బ : ఏంపనిపూర్తివడం బాబూ. మధ్య నాపనిపూర్తియింది.

సురే : ఏంజరిగిందిరా ? చెప్పరా!

సుబ్బ : చెబుతానుబాబూ. కావాలంటే నా పిల్లలమీదగూడా ఒట్టేసి చెబుతాను, నేను నిజంగా పనిపూర్తి చేయాలనే వెళ్ళాను,

రఘు : వెళ్ళితే ?

సుబ్బ : మీరు చెప్పినట్లుగా దారికాశాను, సతీష్ బాబు మీద ఇదే సమయము అనుకొని ఒక్కదూకులో మీద పడ్డాను.

సురే : తరువాత

సుబ్బ : ఎక్కడనుండి ఊడిపడ్డాడో - ఎవరో ముసుగుమనిషి — అమాంతముగా నా మీదపడి నా వళ్ళు హూనంచేసి, చేతిలో కత్తి లాక్కొని నోటినిండా గుడ్డలు క్రుక్కి, చీటి కలో మాయమయాడు, చూడండి యీ దెబ్బలు, ఈ రక్తము. (చూపిస్తాడు.)

రఘు : ఎవడా ముసుగుమనిషి ?

సురే : వాడేరా ఆగర్భ శత్రువు ! (పండ్లు కొరుకుతూ) ఆ రాత్రి ... ...

రఘు : ఆ రాత్రి ?

సురే : దానింట్లో

రఘు : అంటే ప్రభ ఇంట్లోనా ?

సురే : ఔను !

రఘు : అలాగా ? అయితే అసలు కీలకం ప్రభాదేవిలోనే ఉన్న దన్నమాట ?

సురే : ఔను !

రఘు : అయితే నీ బ్రతుకు ఆమెవల్లనే బ్రద్దలౌతుంది. ఆడది తలుచుకుంటే శివుడు మూడో కన్ను తెరచినట్లే. గుట్టు చప్పుడు కాకుండా కుట్రపన్నుతుంది ! ఇప్పటి కయినా అర్థమయిందా ? దానిని ఛేదించాలంటే ఒకటే మార్గం. (చంపమని చూపిస్తాడు)

సురే : ముసుగుమనిషికి దాని, గల సంబంధం యివాళే తేల్చే శ్తాను.

రఘు : యీ కథకు సారథి ఎవరో తెల్సా ?

సురే : ఎవరు ?

రఘు : ఆ రహీం గాడే.

సురే : ఔను ఈ కుట్రలో వాడూ భాగస్వామే ! వీళ్ళ అంతు నేను చూశ్తా ! ఇక సుబ్బడి సంగతి ?

రఘు : విడిచిపెట్టినా బాధే, సఫా చేసిన బాధే !

సురే : అయితే యింకెందుకు ఆలస్యం! ముందు యిక్కడ వీణ్ణి పూర్తి చేస్తే!

సుబ్బ : బాబూ నన్ను విడిచి పెట్టేయండి, నాకే పాపమూ తెలియదు. మీ దయవలన నా ఆశది శాశ్వతో కోలుకుంది. పుణ్యం మీదే నన్ను విడిచి పెట్టండి. (ఇద్దరూ వీలు లేదన్నట్లు తలలూపుతారు.) బాబూ నన్ను నమ్మలేరా?

రఘు : నిన్ను నమ్మేరా ఇంతవరకూ తెచ్చుకున్నాం.

(సుబ్బన్న సురేష్ కాళ్ళమీద పడతాడు)

సుబ్బ : మీరైనా చెప్పండి బాబూ. దొంగోణ్ణయినంత మాత్రాన నాలో నీతి పోయిందనుకున్నారా? ఈ ఒక్క తప్పు కాయండి. బతికి నన్నాళ్ళు మీపాదాలు దగ్గర పడి వుంటాను.

సురే : పోరా యిడియట్ (త్రోసేస్తాడు)

సుబ్బ : (ఆ త్రోపుకి రఘు ముందు పడతాడు) రఘుబాబూ!

రఘు : నోరుముయ్ (ఒక్కబాదు బాదుతాడు.)

(సతీష్ ప్రవేశము)

సతీ : ఒరే రఘు (గట్టిగ కేక పెడతాడు.)

రఘు ; యు గెటౌట్ సతీష్ (కొడుతూ యుంటాడు)

సుబ్బ : బాబూ సతీష్ బాబూ, రక్షించండి!

సతీ : ఒరే రఘూ (కోపంగా) వాడి వంటి మీద దెబ్బ పడిందంటే మీ ప్రాణాలు దక్కవు, మీరు మనుష్యులా, రాక్ష

సులా ? పెళ్ళాం జబ్బులో వుందని మందులకోసం డబ్బు అడిగితే గడ్డి తినిపిస్తారా, బుద్ధి లేదూ ?

రఘు : మధ్య నీ వెవడివోయ్, నీకేం సంబధం తప్పుకో అడ్డు,

(సుబ్బన్నను కొట్టబోతాడు)

సతీ : రఘు (కోపంతో చెంప పెట్టు పెడతాడు)

రఘు : ఆ ! (కోపంగా కలబడబోతాడు.)

సురే: (ఆపి) ఆగు (వెళ్ళిపొమ్మన్నట్లు కనుసైగ చేస్తాడు)

రఘు : హు, (అని చేతులు నలుపుతూ సతీష్‌ని కోపంగా చూస్తూ వెళ్ళిపోతాడు.)

సుబ్బ : తమర్ని భక్షించాలనుకున్న నన్ను కనికరించి రక్షించారు మీరు ఎంత ఉదార స్వభావులు ! మీ మేలు జన్మజన్మా లకు మరచిపోను, నా తప్పులు తమరు మన్నించాలి.

సతి : సరే ఇకనైన బుద్ధి తెచ్చుకుని ఎరొంపిలోకి దిగకుండా హాయిగా సంసారిగా బ్రతుకు పో.

సుబ్బ : చిత్తం వస్తాబాబూ. (నమస్కరించిపోతాడు)

సతి : సరే పో (సురేషు వైపు తిరుగుతాడు) తమ్ముడూ నీ పాపిష్టి ఆస్తికోసం చెప్పుడు మాటలు విని వాళ్ళెవరిచేతనో లంచ మిచ్చి చంపించ ప్రయత్నించడము దేనికి ? నీ సమక్ష ములో ఉన్న నన్ను నీ కసిదీరా చంపు.

సురే : "సతీషు" ఆలోచించకుండా నోటికొచ్చినట్లుగా మాట్లాడు తున్నావు, చంపించడం ఏంటి ?

సతి : (హాహాహా ఖడా, అది నిన్ను యీ పనికి ఉసిగొలిపిన రఘు గాన్నే అడుగు.

సురే : నీ ఉపన్యాసాలు వినడానికి నాకు తీరిక లేదు. దౌర్భా గ్యుడా న్యాయముగా ఆస్తి ఇస్తావా లేదా ?

సతి : నిజంగా నేను దౌర్భాగ్యుడనే, చిన్న తనములోనే తల్లి దండ్రులను కోల్పోయిన అభాగ్యుడను. ఆ పరిస్థితులలో నన్ను చేరదీసి అన్ని విషయాల్లో ఆదరణ చూపించిన నాన్న గారిని ఎన్ని జన్మాలకైనా మరువలేను; ఆ విశ్వా సము తోనే నీమేలు కోరి యింతవరకూ పాటుపడుతూ వున్నాను. ఆయనకిచ్చిన వాగ్దానం ప్రకారం ఏనాటి కయినా నిన్నొక ఇంటివాన్ని చేసి నాబాధ్యత నెర వేర్చు కోవాలను కున్నాను అంతేగాని నీ ఆస్తి కాజేసి నీకు ద్రోహం చేయాలని కాదు.

సురే : కాబట్టే నా ఆస్తి నాకు పంచియ్యి లేదా నేనే నా కాళ్ళ దగ్గరకు రప్పించు కుంటాను.

సతీ : తమ్ముడూ అంతవరకెందుకూ యిదుగో నాన్నగారు నాకు రాసిన వీలు, ఇది నీకు రాసినది. యీ రెంటినీ నీవే తీసుకో (రెండు కవర్లు ఇస్తూ) నా విధి నేను నెర వేర్చు కున్నాను కానీ ఒక్కమాట. ఇకనుంచయినా చెడ్డ స్నేహాలు మాని, మంచి చెడులను గ్రహించి జీవితాన్ని సక్రమ మార్గములో నడిపించి ఆదర్శంగా జీవిస్తావని ఆశిస్తున్నాను. (ఏడుస్తూ) వస్తా తమ్ముడూ (నిష్క్రమిస్తాడు)

(సురేష్ అటూ ఇటూ తిరుగుతూ సతీషు వెళ్ళేవైపే చూస్తాడు)

(సతీషు తెరప్రక్కగా దాగివుంటాడు. రఘు ప్రవేశించి సురేషు చెవిలో ఏదో చెబుతాడు సురేషు నిప్పులు చెల రేగుతూ కోపంగా గర్జిస్తూ)

సురే : అదా సంగతి ! చూస్తా, దీని అంతేంటో తేలుస్తా (అంటూ డ్రాయరు నుండి పిస్టలు తీసుకుంటాడు.)

(స్వగతం) ప్రభా రాక్షసీ యీ నాటితో నీకథ ముగుస్తుంది. నీ కడపటి శ్వాసలు అనంత వాయువులలో లీనం చేస్తాను, (హాహాహా) ఓన్లీ ఫైవ్ షాట్సు (హాహాహా) ఓన్లీ ఫైవ్ షాట్సు, నీతోపాటే ముసుగుమనిషి మర్మము గూడా మంచు విడిపోయినట్లు విడిపోతుంది. టు బరద్స యట్ వన్ షాట్ వెళ్ళబోతాడు)

(సతీషు ప్రవేశం)

సతి : ఆగు, ఆవేశపడి విప్లవం లేవదీశావంటే ముందు నీకు రాబోయె అనర్థమేంటో ఆలోచించావా !

సురే : ఆలోచిస్తే చివరకు మిగిలేది ఆశాభంగమే !

సతి : అందుకని !

సురే : నా హృదయాంతరాళములో బడబాగ్ని నన్ను కారుచిచ్చు వలె దహించి వేస్తోంది, నా జీవిత బాటలో ముళ్ళ కంచువలె అడ్డుతగిలిన ఆ ప్రభను పాముకోరలవంటి నాచే పంజాలో నలిపి నల్లేరును చేయనిదే విడిచి పెట్టను, వస్తా

సతి : ఆగు. అయినా ఒక ఆడుదాని మీాద నీ సాహసం ?

సురే : ఆడది కాదది గాడిద. నాజీవిత జ్యోతిని విషావలజ్వాలలో రగుల్కొల్పిన ఆ పరమ కిరాతకురాలిని మన్నించీ ప్రాణము లతో విడిచి పెట్టడమా ?

సతి : విడిచిపెట్టి తీరాలి, అయినా ప్రభ చేసిన అపచారమేమి లేదే ?

సురే : ఉంది, మన్నింపరాని మహాపచారము చేసింది.

సతి : ఏంటది ?

సురే, దాని భర్తకు విషమిచ్చి చంపి నన్ను చేబట్టింది.

సతి : అందుకు ప్రోద్బలము చేసింది నీవనుకుంటాను;

సురే : కావచ్చు,

సతి : అంటే యిద్దరూ ధోషు లేనన్నమాట.

సురే : ఔను ... కాని, అది విశ్వాస ఘాతకురాలు.

సతి : అలా ఎందుకనుకోవాలి ?

సురే : ఎందుకనా ? దాని భర్త నారాయణరావుని నేనే హత్య చేశానని పోలీసులకు రిపోర్టు చేయాలని రహింగాడితో కుట్రపన్నుతుందట !

సతి : సురేష్, నీకేమైనా పిచ్చెక్కిందా ? చెప్పుడు మాటలతో జీవితాలను, నాశనం చేసుకుంటం మంచిపనిగాదు, ప్రభ అలా కుట్రపన్నుతుందని ఊహించుకుంటము నీవంటి విద్యా

యోగ్యతలు గలిగిన ఒకలాయరుకి తగదు. గిట్టని వాళ్ళు కల్పించిన కథ కట్టుకథ !

సురే : కాదు నమ్మదగిందే :

సతి : అందుకేం చేయదల్చావు ?

సురే : ఖూనీ.

సతి : దానికి శిక్షసీకు తెల్సునా.

సురే : తెల్సు యావజ్జీవిత కారాగారశిక్ష, తప్పితే ఉరిశిక్ష (హహహ) అపుడు పోలీసులు వస్తారు, నా చేతులకు బేడీలు వేస్తారు, అందుకని అడ్డము వచ్చిన వాళ్ళ నందర్ని హతమార్చుతాను. నాకు ప్రతికూలంగా నడచిన వాళ్ళ అందరిని పటాపంచలు చేస్తాను, ఎన్ని హత్యలు చేసినా ఒకటే శిక్ష, ఉరిశిక్ష (హహహ)

సతి : సురేషు, ప్రభ దేమయినా తప్పుంటే ఆమె తరపున క్షమా భిక్ష అడుగుతున్నాను.

సురే : దాని తరపున క్షమాభిక్ష అడగటానికి నీవెవరివి ? నీకేం సంబంధం ?

సతి : మనిషికి, మనిషిపైన సంబంధం లేకుంటే మరెవ్వరికి ఉంటుంది ? అందుకే ఒక సోదరీమణికి, నిండా అన్యాయం జరుగుతూవుంటే వ్యక్తిత్వము గల మానవుడెవడు సహించ చడుతా ?

సురే : సాటి సోదరీమణి ... సాటిసోదరీమణి ! అది ఒక సోదరీ మణి, యీాయనొక సోదరుడు ... పగలు సోదరుడు ... రాత్రులు ....

సతి : (కోపంగా గర్జిస్తూ) సురేష్ మమ్మల్నే శంకిస్తున్నావా ? పశువా, తేలుకొండెలో విషం. పాముకు పడగల్లో విషం, కానీ నీకు నిలువెల్లా రోమరోమానికి విషమే, నీవంటి వాడు మదమాత్సర్యాలతో కండ్లు పొగరెక్కి తల్లి పిల్ల అన్న వావి వరుసలే లేకుండా ప్రవర్తిస్తారు, అందరూ అంతే అనుకుంటున్నావా ?

సురే : ఆయ్, మాటలు చూస్తే కోటలు దాటుతున్నాయి, కూటికి లేని వాడికి నీకింత పొగరా !

సతి : కూటికి లేకపోయినా, నాలో మానవత్వముంది, చేసిన తప్పుకు పశ్చాత్తాపపడి ప్రభను స్వీకరించరా ?

సురే : (హా హా హా) స్వీకరించడమా, అందులో ఒక కులటనా?

సతి : ప్రభ కులటంటావు, ఔను.

సురే : కులటా, కులటా, కులటా, ముమ్మాటికీ అది కులటే !

సతి : నిజమే కాదని నేనెలా అంటాను! ఆడది ఏనాడైతే గడప దాటి బయటకు వస్తుందో ఆనాడే అది కులటతో సమానం ఆమెను అసలు కులటగా మార్చిందెవరూ ?

సురే : అది నీకనవసరము!

ప్రభ : ఏమండీ? వచ్చారా? పోట్లాట వద్దండి వెళ్ళండి. (బ్రతిమాలుతుంది)

(పోట్లాటలో ముసుగుమనిషి నిజస్వరూపం బయట పడుతుంది. ఇద్దరూ పిస్టలుకై పెనుగులాడుతూ వుంటారు. ముసుగుమనిషికి పిస్టలు దొరుకుతుంది.)

ముసు : ఒరీ నీచుడా ఎత్తరా చేతులు?

సురే : (ఆశ్చర్యముగా) అప్పన్న! (స్వగతం) నీవా? ఎంత నాటకమాడావు, మా ఉప్పు పులుసు తింటూ మాకే ద్రోహం తలపెట్టావురా! అప్పన్న! (రెచ్చిపోతాడు)

అప్ప : అప్పన్నను కాదురా నీ పాలిట మృత్యు దేవతను, ఇక నీ ఆట కట్టింది. ముందుకు రావడానికి ప్రయత్నించకు!

ప్రభ : సురేష్, వెళ్ళిపో .... ఏమండీ శాంతించండి.

సురే : ప్రభా? రాక్షసి! (ఘర్జనగా) నీ కుట్ర ఇప్పటికి బయట పడింది. ఇంతకాలమునుండి యీ అప్పన్నగాడితో కలుకుతూ నన్ను హతమార్చడానికి పన్నిన పద్మవ్యూహమని తేలింది. (పండ్లు కొరుకుతూ రెండు చేతులతో గొంతు పిసకడానికి వెళ్ళబోతాడు.)

ముసు : ఆగూ! నా కంఠములో ప్రాణముండగా ప్రభను ఏమీ చేయలేవు సరిగదా, ఆమె పేరును కూడా నీ నోటి నుండి ఉచ్చరించనీయను, అక్కడనుండి మూడుగజాలు వెనక్కి తగ్గు. నీ ప్రాణాలు దక్కుతాయి, ఒక్క అంగుళమయినా ముందుకు వచ్చావా? (పైకి ప్రేల్చి)

సతీ : అంతేనా, కాల్చు, కాల్చరా ఆగావేం ? నా బలిదాన ముతో నైనా నీ బ్రతుకు బాగుపడుతుందని నీ కిదివరకే చెప్పాను. మరచిపోయావను కుంటాను, చంపరా, చంపు.

సురే : ఛీ ముందు నిన్నా, కాదు, ఆ ప్రభను ఆ కిరాతకురాలిని తరువాత నిన్ను (హాహాహా). వస్తా తరువాత కలుసుకుం దాము గుడ్ బై టా. టా.

(తెరలోనికి పరుగెత్తుకుని వెళతాడు)

(తెరలో కారుహారను వినిపించి, ఇంజను స్టార్టుచేసి నెమ్మదిగా ఆగిపోయినట్లు వినిపిస్తుంది)

సతి :- తమ్ముడూ సురేష్ .... నేనూ నీ వెంటనే వస్తాను, నేను ఆలస్యం చేస్తే ఈ పరిస్థితులలో కొన్ని జీవితాలు నాశనం గావచ్చును.

(నిష్క్రమిస్తాడు)

(రంగస్థలం నిర్మానుష్యంగా చేటుంది)

[ తెర ]

గంభీర పిలుపుకు అదిరిపోతుంది.) ఎందుకు ప్రభా అలా వణికిపోతున్నావు? నా పిలుపు నీకు పిడుగు పడ్డట్టనిపించిందా? భయపడకు!

ప్రభ నేనపరాధం చేశాను కాబట్టి.

సురే : (సమయం చూచుకుని సురేష్) సుబ్బన్నా వచ్చావా? (అంటాడు, ప్రభతో మాట్లాడుతున్న నారాయణరావు, బయటకు చూస్తాడు. ఇదే సమయము అనుకొని నారాయణరావు చేతిలోని పిస్టలును.)

సురే : యు గోన్ డై, చావు దుర్మార్గుడా. (అంటూ ట్రిగ్గరు నొక్కుతాడు. గుండు కాలుకు తగులుతుంది.)

నారా : అబ్బా ... ఎంతపని చేశావురా రాక్షసుడా,... ఆ .... ప్రభా .... ప్రభా ....

ప్రభ : ఏమండీ .... ఏమండీ ఎంత ఘోరం జరిగిందండి! (సురేష్ వైపు తిరిగి అపరశక్తివలె, విజృంభించి కండ్లలో నుండి నిప్పుకణాలు కురిపిస్తూ) సురేషు (రౌద్రంగా) ఎంతపని చేశావురా కర్కసుడా. ఇక నీ అంతు నేను చూస్తా. ఛీ నీ జన్మ తగలబెట్ట (టెలఫోను దగ్గరకు వచ్చి.) హాలోన్, హాల్లోవ్, పోలీస్ స్టేషన్ హాత్యా త్వరగా, ఫోను నెంబరు డబ్బై.

సురే : (హహహహ) చావు దుర్మార్గురాలా (డాంమని పిస్టలు పేలుస్తాడు. ప్రభ బాధతో)

సురేష్ ప్రవేశిస్తాడు అన్ని వైపులా పరిశీలిస్తాడు ప్రభ కన్పించదు, భూమి దద్దరిల్లేలాగున.)

సురే : ప్రభా ... ప్రభా .... ప్రభా !

ప్రభ : (లోపలినుండి వస్తూ) వచ్చావా సురేష్ !

సురే : వచ్చాను నీ ఆయుఃప్రమాణం తీర్చడానికి వాచ్చానే (అంటూ పిస్టలు ప్రభ గుండెల మీాద నుంచి పడిపిస్తాడు)

ప్రభ : సురేష్, ఇంకా నాపైన కోపం చల్లారలేదా ?

(చెయ్యి నోటికడ్డుగా ఉంచి ఆశ్చర్యంగా)

సురే : షటప్. (పండ్లు కొరుకుతూ) మండే పుండుమీాద కారం చల్లకు, ఎక్కడా ముసుగుమనిషి ?

(ట్రిగ్గరు నొక్కబోతాడు, వెనుకనుండి ముసుగుమనిషి పిస్టల్ని తన్ని వేస్తాడు. సురేష్ పిస్టలు కోసం ముందు కొస్తాడు, ముసుగుమనిషి కాలుతో పిస్టల్ను త్రొక్కిపెట్టి ఉంచుతాడు. యిద్దరు పెనుగులాడుతూ వుంటారు.)

సురే : ఒరే ముసుగుమనిషి ? యీా నాటకంలో నీ ముసుగు మనిషి పాత్ర మంచులా కరిగిపోతుంది.

ముసు : నీ సురేష్ పాత్రలో ఉండే కుళ్ళుగూడా బయటపడి పోతుంది.

సురే : రాస్కెల్ (ఇద్దరూ బలంగా పోరాడుతు గుద్దుకుంటుంటూరు. క్రింద పడి ముష్టి యుద్ధము చేశ్తారు.)

సతి : నువ్వు ... మాట్లాడవేం ? చుట్టపుచూపుగా కాకినాడ నారాయణరావు ఇంటికి వెళ్ళావు. వయస్సులోవున్న ప్రభను కళ్ళతో చూశావు. కవ్వించి ఆమెను, నీ వైపుకు త్రిప్పుకున్నావు, కాట్రపన్ని ముసలివాడైన ఆమె భర్తను, నాశనం చేసి లోకాన్ని వంచించి ఆమెను గడప దాటించి, చివరకు నీవు ఇదా ఆమెను చేయవలసిన ప్రతిఫలం? నీ వద్దే తరుగని అత్మీయముందని తలంచి వల్లని వల్లపూస యినా లేకుండా, పచ్చని పసుపుకొోము కట్టుకొని మాంగల్యముతో సహా నీకర్పించిన రోజులు మరచిపోయావా ! ఇంకా ఉపేక్ష చేస్తే ఎందరి ఇల్లాండ్ర సౌభాగ్యాలు మంటలో గలుపుతావో ?

సురే : ఉపేక్ష చేయక నీవు చేయగలిగిందేంట్రా బెగ్గర్ ? అవసరమైతే నిన్ను గూడా ....

సతి : చంపుతానంటావు, ఆ ప్రయత్నం ఇంతకుముందే జరిపావు. విధివశాత్తు తప్పిపోయింది.

సురే : అప్పుడు తప్పించుకున్నా, యిప్పుడు తప్పించుకోలేవు, ప్రాణాల మీద ఆశవుంటే తక్షణం యిక్కడ నుండి కదలి వెళ్ళిపో ? లేదా దానికి పట్టబోయేగతి నీకు పడుతుంది.

(జేబులో నుంచి పిస్టలుతీసి పైకి ఎగర వేసి తిరిగి చేతిలోనికి వచ్చేలాగా త్రిప్పుతుంటాడు)

సురే : ఒరే అప్పన్నా, నీ పిస్టలు గుండ్లకు భయపడనురా ! డర్టీ రాస్కెల్ ! నీ పిస్టలు ప్రేలేలోగా నీ అంతు చూస్తాను.

ముసు : ఏడ్చావు? యిప్పటివరకూ నన్ను అప్పన్నగానే భావించి ఆడంబరాన్ని ప్రదర్శిస్తునావు ! నేనెవర్నో చూడు (అంటూ గడ్డము మీసము వూడదీయును.)

సురే : ఆ! ఆశ్చర్యముగా) నీవా ?

అప్ప : నేనే ! నారాయణరావుని.

సురే : నీవింకా బ్రతికే వున్నావా ? (ఆశ్చర్యము)

ప్రభ : (ఏడుస్తూ) ఏంమండీ ! చివరకు నా బ్రతుకులో ప్రళయం విజృంభించింది ?

సురే : నీవా కిలాడీ, ఎంతనాటకమాడావే ? సరే నారాయణరావు త్రాగిన విషం ?

సురే : ఓ ! ప్రభాదేవిగారా (హాహాహా) మా ద్వితీయ భార్యా శ్రీమతి ప్రభాదేవిగారా ? మీరు యీ క్షణము వరకూ సురక్షితముగా వున్నందుకు అభినందిస్తున్నాను. యీ నాటికయినా రంకుమగని ప్రేమసామ్రాజ్యములోని రంగును అర్ధము చేసుకున్నారు, నాకదే పదివేలు.

ఖబడ్దార్ సురేష్ ! (పారిపోవడానికి ప్రయత్నిస్తాడు.) కాలు కదపడానికి ప్రయత్నించావో కాల్చేస్తాను. హాహాహా (నారాయణరావు ప్రభ వైపు తిరిగి మాట్లాడడానికి ప్రయత్నిస్తాడు) ప్రభా ! (ప్రభ నారాయణరావు

# ఆఖరు సీను

## ప్రభ ఇల్లు

(తెర ఎత్తేటప్పటికి ప్రభ ఏడుస్తూ పాట పాడుతూ వుంటుంది రంగస్థలములో సామాగ్రి అంతా చిందరవందరగా ఉంటుంది, ప్రభ జుట్టు రేగి చాలా నిరసించి ఉంటుంది.)

(జరా సామ్నేశో ఆవో ఛలియే అను వరుస)

నను మరచావా నాదు ప్రియతమా
చుర, చుర, చూశెరా యీ పాడులోకమూ
నా ఆశలే నిరాశలై పోయెనా
నా వలపంతా వేసారి పోయెనా ॥నను॥
కసి బూనె లోకమూ
కలకాలం శోకమూ
కన్నీరు మున్నీరుగా ఆ అ ఆ ఆ ఆ ....
విషమాయె ప్రేమరా
మసి ఆయె మనసురా
వ్యసనము ఫలమ్మాయెరా
యిక కనలేను నీదూ జాడలూ
ఇల మనలేను నీ ఎడబాటుకూ
ఆరగిలేను మనసున వేదనా
ఆ వేదనలో సాగె జీవితం ॥నను॥

(ఏడుస్తూ యింటిలోనికి పోయింది, మరొక రెండు నిముషములవరకు రంగస్థలమంతా శూన్యముగా వుంటుంది,

ప్రభ : ఆ అబ్బా, ఏమండీ (అంటూ మెలికలు తిరుగుతూ ఆర్తి పాదాలుకు దేకుతూ పోతుంది, మొదటి గుండు కాలికి, రెండవ గుండు గుండెల్లో తగులుతుంది) సురేష్, యీ పరాజయం నాదిగాదు నీదే. నా అనంతరం నీ బ్రతుకెలా మారుతుందో చూడు.

సురే : యీ నాటితో మీ ఇరువురి పీడ విరగడైంది, గుడ్ బై. (అంటూ లోనికి పోవును)

ప్రభ : అబ్బా ... ఆ...ఏమండీ... ఆ... (దేక్కుంటూ నారాయణరావు పాదాలు పట్టుకుని) ఏమండి ...

నారా : ప్రభా ... యిప్పుడు మనకు పాపవిమోచనమైంది. (ఆనందాశ్రువులు కార్చును)

ప్రభ : ఇప్పుడు నామనస్సు చాలా సంతోషంతో చిందులు త్రొక్కుతోంది.

నారా : నిజంగానే ప్రభా. ... నీలో యీ పరివర్తన రావడం నాకెంతో సంతోషంగా ఉంది. అబ్బా ...

ప్రభ : ఇటువంటి ప్రేమమూర్తి, ఆదర్శమూర్తి అయిన మీకు, అబ్బా ద్రోహం తలపెట్టినందుసకు ఆ ... నాకు తగిన శాస్తి జరిగింది మనసారా మన్నించానని మీ నోరారా ఒక్కసారంటే నా తుది ఘడియలు అమృతపు ఘడియలుగా భావిస్తాను. బ్రతికి ఉండగా మిమ్మల్ని సుఖపెట్టలేక అప

ఖ్యాతి తెచ్చిపెట్టి పోతున్నాను. అబ్బా ... ఒక్కసారి మన్నించావనండి.

నారా : ఆ ... అబ్బా ... మన్నించాను ప్రభా.

ప్రభ : చిరునవ్వుతో) అదుగో నా ఇనుపగజ్జెల తల్లి, మృత్యు దేవత శాశ్వతంగా తన వడిలో జోలపుచ్చడానికి ఆహ్వా నిస్తోంది, మీకు తీరని వ్యధ పెట్టి వెళ్ళిపోతున్నాను, ఇవే నా కడపటి జోహార్లు. (పాదాలలో తలపెట్టి ప్రాణాలు విడిచి పెట్టును)

(ఇంతలో ఎక్కడనుండో పోలీసు విజిల్సు దూరము నుండి వినబడుతు టాయి. రంగస్థలం విషాదంగా ఉంటుంది. ఒక వైపున ఉరుములు మెరుపులతో వర్షం వస్తూంటుంది, రఘు సిగ రెట్టు వెలిగిస్తూ స్టేజి మీదకు వచ్చి అప్రయత్నంగా కాలికి తగిలిన ప్రభ భౌతిక శరీరము చూచి అదిరిపడి సాను భూతితో తాకి)

రఘు : ప్రభా ... అనుకున్నంతపని జరిగిపోయింది. ఎక్కడ పుట్టావో .... ఎక్కడ పెరిగావో చివరకు ఈ దిక్కులేని చావు చచ్చావా ? (స్వగతం) బ్రతికినన్నాళ్ళు లోకంలో తెవిడిచి తుచ్ఛమైన కామవాంఛకు దాసురాలివై పవిత్ర మూర్తయిన సింధ ర్తకు ద్రోహంచేసి నీవు మనసిచ్చిన మగవాడి చేతిలో దారుణంగా చంపబడ్డావు. నీవేకాదు, ప్రపంచములో పతికి ద్రోహం తలపెట్టి పరపురుషుని వాం ఛించిన ఏ స్త్రీకైనా చివరకు ఇదే శాస్తి జరుగుతుంది

(కన్నీరు కారుస్తూ కొంతదూరం పోతాడు) (నారాయణ రావు శవం కనబడుతుంది) తాకి, నారాయణరావు (నిట్టూర్చి) పాపం : కోటికిపడగెత్తి ప్రపంచములో పరువు ప్రఖ్యాతులు గడించి కాటికి కాళ్ళుచాచిన నారాయణ రావు ఆడదంటే కీలుబొమ్మ అనుకొని డబ్బు వెదజిమ్మి అందాల భరిణి అయిన పడుచు భార్యను మూడో పెండ్లి చేసుకొని ఆమెను సుఖపెట్టలేక తనవల్ల ఆమెకు సుఖంలేక సంసారం రచ్చకెక్కించుకొని చివరకు ఒక అనామధేయుని చేతిలో హతమార్చబడ్డాడు. (పోలీసు విజిల్సు బిగ్గరగా సమీపంలో వినబడుతుంటాయి.)

రఘు : ఎక్కడనుండి ఈ పోలీసు విజిల్సు

(సురేష్ వణుకుతో ప్రవేశించి, భయంతో)

సురే : రఘు ... రఘు ... రక్షించరా (వణికి పోతుంటాడు)

రఘు : ఏం జరిగిందిరా ?

సురే : జరిగిందంతా సావధానంగా చెబుతాను, ముందు నన్ను కాపాడరా.

(మళ్ళీ పోలీసులు విజిల్సు వినబడుతాయి.)

అదుగో పోలీసులు వచ్చేస్తున్నారు.

రఘు : పోలీసులా ? ఔను వస్తున్నారు. నీ స్వార్థంకోసం వీళ్ళిద్దర్ని ...

సురే : ఖూనీ చేసింది నేనే, యీ పరిస్థితులలో మన చిన్ననాటి స్నేహాన్ని పురస్కరించుకొని నన్ను రక్షించరా !

రఘు : నీతో పొత్తు కలిపి నా గుట్టుగా పోతున్న బ్రతుకు రట్టు చేసుకోన మంటావా ?

సురే : కాఠిన్యముతో కర్కుసునిలాగ ప్రవర్తించకురా, నీవు ఒక్క క్షణము ఆలశిస్తే పోలీసులు ముట్టడించి నన్ను ఆరెస్టు చేయువచ్చు

రఘు ( అలా జరిగితే చాలా సంతోషిస్తాను పోరా, ఖూనికోర్, ముందు నన్ను పోనియ్ ?

సురే : (రౌద్రముతో) ఒరే రఘూ, ఇంకా ఒక అవకాశాన్నిచ్చి మాట్లాడుతున్నాను. మర్యాదగా బ్రతకాలంటే సహాక రించి రక్షిస్తావా మంచిది, లేదా వీళ్ళిద్దరికి పట్టినగతే నీకూ పడుతుంది .(అని చొక్కా పట్టుకుంటాడు.)

రఘు : విడు, (విడిపించుకుంటానికి ప్రయత్నిస్తూ) యీా పరిస్థితు లలో నేనేం చేయలేను.

సురే : చెయ్యాలి నాగురించి ప్రాణాలైనా యివ్వాలి. యిదిగో నా సర్వస్వం నీకే ధారాగతం చేస్తున్నాను, (వీలునామా చేతిలో పెట్టబోతాడు.)

రఘు: డబ్బుకోసం నీలాంటి ఖూనీకోరుని ప్రపంచంలో బ్రతుకనిస్తే ఇంకా చాలామందిని పొట్టన బెట్టుకుంటావురా. విడువరా?

సురే : విశ్వాస ఘాతకుడా ! బాగున్నన్నాళ్ళు నా సొమ్ముతిని నాకే అపకారం తలపెట్ట జూస్తున్నావా ! వీటన్నింటికి కారకుడవు నీవే కాబట్టి నిన్ను నాశనం చేస్తేనే గాని నా

కడుపుమంట చల్లారదు. (అంటూ మీదకు దూకుతాడు, ఇద్దరూ పెనుగులాడుతారు, సురేష్ పిస్టలుతో ప్రేల్చబోతాడు, దానిలో తూటాలుండవు, తిరిగి విసిరి పారవేస్తాడు. తరువాత రఘు గొంతు పిసిగి చంపుతాడు. ఆ సమయంలో రహీం వస్తాడు. వెనుకనుంచి చూచి.)

రహీం : అరే బాప్ రే. మూడు ఖూనీల్ చేసావ్, ఉండు పోలీసుల్ కి తీసుకు వస్తాన్. (అంటూ పరుగెడతాడు.)

సురే : ప్రభా ... ప్రభా .... ప్రభా ఎంతపని జరిగింది. ప్రభా నేను నీ నిండు ప్రాణాన్ని పొట్టన బెట్టుకున్నాను. తాత్కాలిక కామవాంఛకు దాసురాలివై కడకు నీ జీవితాన్నే బలి చేసుకున్నావు. నీ ప్రశాంతమయిన నీ నయనాలను విప్పి ఒక్కసారి యీ నిర్భాగ్యుడను చూడవు ? హిం హిం హిం జీవితమనే ఆకాశమునుండి యీ మిల మిలా మెరిసే నీ దివ్యతార నేటితో నేల గూలెనా? ప్రభా! అభ్బా (బాధగా) నీ హృదయము నుండి స్రవించే నెత్తుటి ధారకు నా విషపూరితమయిన మాంసము ముక్కలుగా చేసి దానిని నీ సమాధి ముందు అభిషేకము చేసేవరకు నా ఆత్మకు శాంతిలేదు, లేదు, లేదు. ఇన్ని పాపాలు చేసిన నేను పోలీసుల చేతులలో చిక్కుకుని యమయాతలు అనుభవించడము కన్నా ఆత్మ హత్యే ప్రధానం. నేను నీ చెంతకే వస్తున్నాను. (అంటూ తల స్తంభానికి ఆనించి బాదు కుంటూ ఉంటాడు)

(సతీష్ ప్రవేశము)

సతి : తమ్ముడూ, ఆపు నీ ప్రయత్నం.

సురే : అన్నయ్యా, నన్ను చావనియన్నయ్యా! నా కడసారి కోరిక ఇదే. (కాళ్ళమీద పడి భోరున ఏడుసూ) నా తప్పులన్నీ క్షమించానని నోరార ఒక్కసారి అను అన్నయ్యా?

సతి : (లేవనెత్తి) తమ్ముడూ, చాలా తొందరపడ్డావు తమ్ముడూ! నేను చెబితే విన్నావా? వీళ్ళందర్ని పొట్టబెట్టుకుని, నీవు మాత్రం బావుకునదేముంది? నేనాలస్యముగా రాకపోతే ఇంత జరిగి ఉండేది కాదు గదా! (తెరలో పోలీసుల విజిల్సు వినబడతాయి)

సురే : అదుగో వచ్చేస్తున్నారు పోలీసులు.

సతి : అందుకే సురేష్, నీవు పారిపోవడం చాలా మంచిది, ప్రాణాలు గుప్పిట పట్టుకుని నీ ఇష్టము వచ్చిన దగ్గరకు పోయి ప్రాణాలు రక్షించుకో వెళ్ళు .... ఆలస్యమయితే చిక్కులపాలవుతావు,

సురే : అన్నయ్యా, ఎక్కడకు వెళ్ళినా ప్రభుత్వాన్ని వంచి చ లేను, చట్టాన్ని న్యాయాన్ని ధిక్కరించి ఎంతకాలం మారువేషంతో మ్రగ్గగలను? వచ్చే పోలీసులకు నీ సమాధానం?

సతి : నేను చూచుకుంటాను,

సురే : అన్నయ్యా (ఏడుస్తూ)

సతి : తమ్ముడూ ! ఏడుస్తూ కౌగలించుకుంటాడు)

సురే : నీ మేలు జన్మ జన్మాలకు మరువలే నన్నయ్యా,

సతి : సరే. వెళ్ళు తమ్ముడూ.

(సురేష్ విడువలేక విడువలేక వెళ్ళబోతుంటాడు, చేతిలోకి పిస్టలు తీసుకుంటాడు. ఇనస్పెక్టరు, ఇద్దరు పోలీసులు రహీంతో ప్రవేశిస్తారు. ఇనస్పెక్టరు పిస్టలు లాక్కొని) ఆగు! (సురేష్‌ని పట్టుకుని) ఏయ్ టు నాట్ ఫోర్, ఫైవ్ నాట్ వన్. ఇతని దుస్తులను సోదాచేసి సంకెళ్ళు వేయండి (అంటూ సతీష్‌ని చూపిస్తాడు)

సురే : (ఆశ్చర్యంగా అతను నిర్దోషి, ఏ పాప మెరుగడు, ఈ హత్యలు చేసింది నేను. నన్ను బంధించండి సతీష్ నిర్దోషి

రహి : కాదు సర్కార్, సతీష్‌బాబూ చాలామంచివారు, ఈ దుర్మార్గుడు తమ్ముడు అన్న ప్రేమ కొలది, అతని నేరాలన్ని ఈయనే చేసినట్లు ఒప్పుకుంటున్నారు.ఆయన నిర్దోషి నేను కళ్ళారా చూశాను. సురేషు ఖూనీకోరు.

సురే : లేదు ఇనస్పెక్టరు, నన్ను నమ్మండి, నేను దోషిని, ఆశిక్ష నాకివ్వండి.

ఇన : మిస్టరు సురేషు, శిక్షనివ్వడానికి మేమెవరిమి ? ఏదైనా చెప్పుకోదలచుకుంటే కోర్టులో చెప్పుకోండి. అతనే నేరస్తుడనటానికి తగిన సాక్ష్యాలు కనబడుతున్నాయి.

సురే : అన్నయ్యా, పరిస్థితులు పరిసరాలు నా నేరాన్నే నిరూపిస్తున్నపుడు అబద్ధం చెప్పి నమ్మించాలంటే నీ వల్లగాదు నేను దోషిని, ఈ హత్యలన్ని నేనే చేశాను. అందుకు దండనార్హుడను నేను.

సతి : తమ్ముడూ !

సురే : అన్నయ్యా! నా పాపం పండింది. ఇంతవరకు కండ్లు పొగ రెక్కిన నేరాలేమైనా ఉంటే త్రికరణ శుద్ధిగా నన్ను మన్నించన్నయ్యా, (ఏడుస్తూ) ఇనస్పెక్టరు యిక మీ పని కానివ్వండి.

సతి : తమ్ముడూ, [కౌగలించుకుంటాడు]

ఇన : వయ్ టు నాట్ ఫోరు

204 : యస్ సర్

ఇన: యీ శవాల్ని పోస్టుమార్టనుకి పంపించండి [క్రింద కన్పించిన జేబు గుడ్డను దీసి చూసి] మిస్టరు నీ పేరు ?

సురే : సతీష్

ఇన : ఐ. సి. చాలు ఇక పద

సురే : వెళ్ళబోతూ (సతీషుని చూచి కళ్ళనీరు కారుస్తాడు)

సతీ : తమ్ముడూ

సురే : అన్నయ్యా (కౌగలించుకొని ఏడుస్తు ఉంటాడు)

ఇవ : నడువు, వూ.

సురే : విడువలేక విడువలేక వెళ్ళుతుంటాడు. రహీం సతీషులు అతన్ని అనుసరిస్తూ ఉండగా,

నేపథ్యగానం

సాకీ : అయ్యయ్యో - అభాగ్యుడా
తీరిపోయెనా - తమ్ముని ఋణమే
ఆరిపోయెనీ - ఆశా జ్యోతీ

పాట : తలపోయకురా - ఓ నరుడా
వలపోయకురా - ఓ నరుడా ॥తల॥
కలత నిదురలో, కాంచిన కలలే
గాలిమేడలై - కూలిపోయెనా
తమ్ముడు - చేసిన ఘోరములన్ని
క్షణమైనా - నీవు మరువబోకురా
నీతి లేని - ఆసోరుడే
నిందలపాలై - వందనమనెరా ॥తల॥

(రహీం ఏబుతుంటాడు ఇనస్పెక్టరు స్టేటుమెంటు వ్రాసుకుంటాడు) [తెర]

(కోర్టు అంతా హడావుడిగా వుంటుంది)

ముగ్గురు గవర్నమెంటు ప్లీడర్లు ఏదో వ్రాసుకుంటుంటారు ఒక ప్యూను జడ్జి స్థానము దగ్గర నిలబడి వుంటాడు.

ప్యూన్ : సైలెన్సు పబ్లిక్ కోర్టు

(జడ్జి ప్రవేశము)

(అందరూ నిశ్శబ్దముగా లేచి జడ్జి కూర్చుండగానే అంతా కూర్చుంటారు)

(జడ్జీ ముందు కొన్ని ఫైల్సు వుంటాయి వాటిని తిరగేసి)

(ట్రిబుల్ మర్డర్ కేస్ యస్. సి. 30/61 ముద్దాయి సతీష్‌ను కోర్టులో హాజరు పెట్టవలసింది అంటాడు)

బంట్రో : మర్డరు కేస్ ముద్దాయి సతీష్, మర్డరు కేస్ ముద్దాయి సతీష్ - మర్డరు కేస్ ముద్దాయి సతీష్

(పోలీసు ఇనస్పెక్టరు ముద్దాయిని హాజరు పెడతాడు)

(ముదాయి సతీష్ బోనులో నిల్చొనును)

బంట్రో : దేముని ఎదుట ప్రమాణముచేసి అంతా నిజము చెబుతాను, అబద్ధం చెప్పను అంతా నిజం చెబుతాను.

సతీ : దేముని ఎదుట ప్రమాణముచేసి అంతా నిజము చెబుతాను అబద్ధ చెప్పను, అంతా నిజం చెబుతాను.

జడి : (చార్జిషీట్సు వ్రాసి యీ దిగువ విధముగా చదువును. నీ మీాద పోలీసు వారు నారాయణరావు ఎలియాస్ అప్పన్నను అతని భార్యా ప్రభాదేవిని, రాఘువయ్యను ఒకే సారి హత్యచేసినట్లు ఐ. పి. సి. 302 సెక్షను క్రిందను ప్రభావతి గర్భములో ఉన్న శిశువును దారుణముగా హత్య గావించి నందుకు ఐ. పి. సి. 316 సెక్షను క్రింద నిందా

రోపణ మోపి చార్జీషీటు దాఖలు చేసియున్నారు. ఈ హత్య లకు నీవే కారణమని నిందారోపణ చేయబడినది. కావున దీనికి నీవేం సమాధానం చెపుతావు?

సతీ: నేను నిర్దోషినని నిరూపించుకోటానికి నాకు తగిన సాక్ష్యాలు లేవు. ఇంతకన్నా చెప్పుకోతగింది ఏమీ లేదు.

జడ్జి : అయితే నీ తరపున వాదించాటానికి ఎవరైనా ప్లీడరు ఉన్నారా ?

సతి : లేరు.

(సురేష్ ప్లీడరు దుస్తులలో చేతిలో ఫైల్సు పట్టుకుని ప్రవేశించి)

సురే : ఉన్నాడు - నేను ఉన్నాను యస్ యువరు ఆనర్

సతి : (చేతులు చాచి ఏదో చెప్పబోయి మౌనము వహించును)

జడ్జి : పబ్లిక్ ప్రాసిక్యూటరుగారు ముదాయి నేరస్తుడని రుజావు చేయవలసిన బాధ్యత ప్రాసిక్యూషన్ వారిపైవుంది. కనుక తగు సాక్ష్యాధారాలతో ముద్దాయి నేరస్తుడని నిరూపించా లని కోర్టు వారు కోరుతున్నారు

పి. పి, : యస్ యువరు ఆనరు ముద్దాయి యీ హత్యలకు బాధ్యుడని నిరూపించడానికి తగిన సాక్ష్యాధారాలు పూర్తిగా వున్నవి. ప్రాసిక్యూషన్ తరపున, సబ్ ఇనస్పెక్టరు సాక్ష్యాన్ని విచారించ గోరుతున్నాను.

జడ్జి : సబ్ ఇన్‌స్పెక్టరు గారిని ప్రవేశపెట్టు

బంట్రో : సబిన్‌స్పెక్టరుగారు ! సబిన్‌స్పెక్టరుగారు! సబిన్‌స్పెక్టరు గారు.

సబిన్ : (బోనులో ప్రవేశించును.)

బంట్రో : దేవుని ఎదుట ప్రమాణము చేసి అంతా నిజం చెబు తాను అబద్ధం చెప్పను

యస్. ఐ. : దేవుని ఎదుట నిలబడి ప్రమాణము చేసి అంతా నిజం చెబుతాను, అబద్ధం చెప్పను

పి. పి. : సబిన్‌స్పెక్టరుగారు ప్రభావతి ఇంట్లో హత్యలు జరిగి నట్లు మీాకెట్లా తెలిసినది !

యస్. ఐ. : హత్యా ... హత్యా పోలీస్ ... అర్జంటు అని మాకు ఫోన్ కాల్ వచ్చింది.

పి. పి. : అంతేనా

యస్. ఐ. : ఔను

పి. పి : మరేమయిన ఇతరమాట వినిపించలేదా ?

యస్. ఐ : కెవ్వున కేక వినిపించింది, మేము ఎంత ప్రశ్నించినా తిరిగి సమాధానం రాలేదు !

పి పి : ఆ ఫోన్ కాలు ప్రభావతి ఇంట నుండే వచ్చినట్లు మీా కెలా అర్థమయింది

యస్. ఐ : ఎక్స్చేంజి ఆఫీసుకు ఫోన్ చేసి అడిగాం వారు అది 72 ఫోన్ నెంబరు ఆ ఫోను గల వారి అడ్రస్ వారి తాలూకు వివరాలు చెప్పారు!

పి. పి : అప్పుడు మీరేం జేశారు!

యస్. ఐ : వెంటనే నేను కొంతమంది పోలీస్ సిబ్బందితో హత్యా ప్రదేశమునకు వెళ్ళినాము హత్య జరిగిన చోట ఈ ముద్దాయి ఒక్కడే అనుమానాస్పద పరిస్థితులలో బిత్తరి చూపులతో పారిపోవుటకు ప్రయత్నించు చుండగా అనుమానముతో మేము పట్టుకున్నాము.

పి. పి : హత్య సమయములో అక్కడ మరెవ్వరైనా ఉన్నారా?

యస్. ఐ : లేరు కాబట్టి ముద్దాయేనని సంశయముగా హత్య చేశాడన్న విశ్వాసముతో అతనిని అరెస్టుచేసి కోర్టునకు హాజరు పెట్టాం!

పి. పి : శవములను డాక్టరు పరీక్షకు పంపించారా?

యస్. ఐ : పంపాము-

పి. పి : డాక్టరు సర్టిఫికేటులు కోర్టులో హాజరు పెట్టినారా

యస్. ఐ : పెట్టాము,

పి. పి : శవముల ఫొటోలు తీయించి కోర్టులో హాజరు పెట్టారా

యస్. ఐ : పెట్టాము

పి. పి : హత్యా ప్రదేశములో మీకు అనుమానా స్పదమయిన వస్తువులు ఏమయినా దొరికాయ్యా?

యస్. ఐ : దొరికాయి

పి. పి : ఏంటవి!

యస్. ఐ : ముద్దాయి ఉపయోగించే జేబుగుడ్డ

పి. పి : దానిమీద అనుమానింపదగిన గుర్తు లేమయినా ఉన్నవా?

యస్. ఐ : ఉంది, యస్ అను చాకలి గుర్తు మాత్రమే వుంది

పి. పి : (జేబుగుడ్డను తీసి) ఇదేనా హత్యా ప్రదేశములో దొరికిన జేబుగుడ్డ?

యస్. ఐ : (పరీక్షించి) ఔను!

పి. పి : దానిపై యస్ చాకలి గుర్తు ఏం తెలియ జేస్తుంది!

యస్. ఐ : సతీష్ అను పేరును తెలియ జేస్తుంది!

సురేష్ : (డిఫెన్సు ప్లీడరు అనగా ముద్దాయి తరపు వాదించువాడు) ఐ అబ్జెక్టు ఫరు దిస్ యువరు హానరు,

జడ్జి : ఆర్డర్, ఆర్డర్

పి. పి : శవముపైనున్న రక్తము మరకలను జేబుగుడ్డపైనున్న రక్తపు మరకలను రసాయనిక పరీక్షకు పంపించినారా?

యస్. ఐ : పంపించాము

పి. పి : శవములు కూడా పోస్టుమార్టం చేయించారా?

యస్. ఐ : చేయించినాము

పి. పి : రాఘవయ్య చనిపోవుటకు గల కారణమేమని డాక్టరు సర్టిఫికెట్ ఇచ్చినాడు?

యస్. ఐ : బలవంతముగా రాఘవయ్య గొంతు పిసగడము వలన ఊపిరాడక చనిపోయినట్లు డాక్టరు సర్టిఫికెట్ యిచ్చినాడు

పి. పి : ఇదేనా ఆ డాక్టరు సర్టిఫికెట్ !

యస్. ఐ : ఔను

పి. పి : రాఘవయ్య కంఠముపై నున్న వ్రేలి ముద్రలను పోటోలు తీయించి, వ్రేలి ముద్రల నిపుణునకు పరీక్షించే నిమిత్తం పంపినారా!

యస్. ఐ : పంపినాము!

పి. పి : ఇదే నా వ్రేలి ముద్రల నిపుణుల రిపోర్టు

యస్. ఐ : ఔను !

పి. పి : దట్సాల్ ! యువర్ హానరు (అని కూర్చొను)

(సురేష్ లేచి)

మిష్టర్ సబిన్‌స్పెక్టరు హత్య జరిగినట్లు ఫోను ఎన్ని ఎన్ని గంటలకు చేయబడింది?

యస్. ఐ : పదిన్నర గంటలకు !

సురే : పగలా - రాత్రా !

యస్. ఐ : రాత్రి

సురే : హత్య జరిగిన ప్రదేశానికి పోలీస్ స్టేషనుకు ఎంత దూరము?

యస్. ఐ : సుమారు రెండుమైళ్ళు వుండవచ్చు

సురే: ఆలాగా, అయితే మీరు హత్యా ప్రదేశానికి చేరేటప్ప టికి ఎంత టైమైంది!

యస్. ఐ: రాత్రి పదకొండు గంటలయింది

సురే: మీరుకారుమీద వెళ్ళారా! నడిచి వెళ్ళారా

యస్. ఐ: కారుమీద

సురే: రెండుమైళ్ళు కారుమీద వెళ్ళడానికి ½ గంట పట్టిందన్న మాట హత్య జరిగినట్లు మీకు ఫోను రాగానే దానిని మీ జనరల్ డైరీలోగాని స్పెషల్ కేసు డైరీలో గాని నోటు చేశారా

యస్. ఐ: (బిత్తరపోయి) లేదు

సురే: యువరు హానరు, ప్లీజ్ రికార్డుదట్ సెంటెన్సు

జడ్జి: వ్రాసుకొనును

సురే: హత్యా ప్రదేశానికి పోలీసు స్టేషనుకు ఎంత దూరమన్నారు

యస్. ఐ: సుమారు రెండు మైళ్ళు!

సురే: నేరం జరిగింది రాత్రి పదిన్నర గంటలకు పోలీసులు నేర ప్రదేశానికి చేరింది రాత్రి పదకొండు గంటలకు కాబట్టి రెండు మైళ్ళు కారు మీద వెళ్ళడానికి అరగంట పట్టిం దని, ఇనస్పెక్టరుగారు సాక్ష్యము చెబుతూ ఉన్నారు, యువరు హానరు ప్లీజ్ రికార్డుదట్ సెంటెన్సు

జడ్జి: (వ్రాయును)

సురే : మిస్టర్ సబిన్ స్పెక్టరు హాత్య ప్రదేశములో ప్రభను, అప్పన్నను చంపింది దేనితో

యస్. ఐ : పిష్టలుతో

సురే : అక్కడ మీకు పిష్టలు దొరికిందా

యస్. ఐ : లేదు

సురే : (జేబుగుడ్డను తీసి) ఈ జేబు గుడ్డ సతీష్ దేనని నిరూపించ డానికి ప్రత్యేకమయిన ఆధారాలేమయినా ఉన్నాయా?

యస్. ఐ : వున్నాయ్ యస్ అనే చాకలి గుర్తు సతీష్ అనే పేరును గుర్తు చేస్తుంది!

సురే : యస్, అను అక్షరము సతీష్‌నా లేక ఇతరముయిన సత్యం సుబ్బన్నా సూర్యం, సురేష్ మొదలయిన పేర్లను తెలియజేస్తుందా!

యస్. ఐ : ఇతర పేర్లనుకూడా తెలియజేస్తుంది!

సురే : కాబట్టి పై నుదహరించి, యస్‌తో ప్రారంభమయ్యే ఇతర పేర్లు గల వాళ్ళు కూడా యీ హత్యను చేయడానికి అవకాశము వున్నదన్న మాటే గదా!

యస్. ఐ : ఔను!

సురే : కనుక సతీష్ ఈ హత్యను ఘంటాపదంగా చేశాడన టానికి అవకాశం లేదు గదా

యస్. ఐ : లేదు

సురే : పదిన్నర గంటలకు హత్యలు జరిగాయి పదకొండు గంటలకు మీరు చేరుకున్నారు మధ్య నున్న అరగంట వ్యవధిలో ముద్దాయి సతీష్ హంతకుడు అయివుంటే అవకాశం చూసుకొని పారిపోవడానికి వీలుంది గదా!

యస్. ఐ : వుంది

సురే : ప్రభ శరీరములో నుండి వచ్చిన రక్తానికి జేబుగుడ్డ మీద నున్న రక్తానికి తేడా ఉన్నట్లు డాక్టరు సర్టిఫికేటు ఉందా!

యస్. ఐ : ఉంది

సురే : పిస్టలు ప్రేలినపుడు కళ్ళారా చూచిన వాళ్ళు ఉన్నారా

యస్. ఐ : లేదు

సురే : గుండ్లు హతుల గుండెల్లో దూసుకుపోయిన విధానాన్ని డాక్టరు ఏవిధముగా సర్టిఫికెటులో సూచించారు ?

యస్. ఐ : అడ్డంగా, ఇరువురు గుండెల్లో దూసుకు పోయినట్లు డాక్టరు సర్టిఫికెట్‌లో సూచించారు

సురే : చనిపోయిన రాఘవయ్య కంఠము మీద ప్రేలిముద్రలు సతీష్ చేతి ప్రేలి ముద్రలకు వ్యత్యాసమున్నట్లు ప్రేలి ముద్రల నిపుణుని పరిశోధన సర్టిఫికెట్‌లో ఉంది గదా !

యస్. ఐ : ఔను !

సురే : ఫాయింటు బ్లాంకు అనగా ఏంటి ?

యస్. ఐ : పాయింటు బ్లాంకు అనగా నేరుగా గురి చూచి కాల్చుట అని అర్థము

సురే : దట్స్ ఆల్ యువరు ఆనర్ (కూర్చొనును)

పి. పి: యస్ యువర్ ఆనర్ ఈ కేసులో ముద్దాయి సతీష్ దురుద్దేశముతో నారాయణరావు ఎలియాస్ అప్పన్నను చంపి అతని ఆస్తి కాజేయాలన్న దుర్బుద్ధితో రాత్రి పదిన్నర గంటలకు నారాయణరావును పిస్టలుతో కాల్చి చంపాడు ఈ దురంతమును చూసి అతని సతీమణి పోలీసులకు ఫోను చేస్తుండగా తన హత్యా నేరాన్ని పోలీసులకు తెలియబరుస్తుందన్న ఆవేశం కడుపులో పెట్టుకొని అదే పిస్టలుతో ఆమెను కూడా కాల్చి చంపాడు! అతను పారిపోవుటకు ప్రయత్నించు చుండగా పొరుగింటి రాఘవయ్య వచ్చి అప్రయత్నంగా సతీస్ ని అటకాయించినందుకు తన బండారము కాస్త బయటపడుననే ఉద్దేశముతో నిర్దాక్షిణ్యముగా అడ్డము వచ్చిన రాఘవయ్యను ఈ హంతకుడు గొంతు పిసికి రాఘవయ్యను హత్య గావించినాడు ఈ మూడు హత్యలను ఇతడే చేసినటు అనుమాన రహితంగా ప్రాసిక్యూషన్ వారు తమ సాక్ష్యులను విచారించి ఋజువు పరచినారు! ముద్దాయి నేరస్తుడని నిరూపించడానికి హత్య ప్రదేశములో దొరికిన ఆధారములు (మెటీరియల్ బై ఆబ్జెక్టు) హత్య జరిగిన పరిస్థితులు ముద్దాయి నూటికి నూరు పాళ్ళు నేరస్తుడని ఋజువు చేయబడింది!

ఆ హత్యల ప్రదేశములో దొరికిన జేబుగుడ్డపైగల యస్. అనే అక్షరము ముద్దాయి అయిన సతీష్ పేరును తెలియ జేస్తుంది! శవముపైనున్న రక్తపుమరకలను శవములోపల నున్న పిస్తోలుగుళ్ళు ముద్దాయిచే ప్రయోగించబడినవని డాక్టరు సర్టిఫికేటువలన ఋజువు అయినది. సాక్ష్యాలు అబద్ధమాడినా పరిస్థితులు అబద్ధమాడవనె సామెత ప్రకారము యువర్ ఆనర్, ముద్దాయి ఆ పరిస్థితులలో పోలీసులను చూసి పారిపోవుటకు ప్రయత్నించబోయినాడు గావున ఇతనే యీ హత్యలన్నీ చేసిఉంటాడని అనుమానము రూఢిగా ఋజువైనది! కాబట్టి యువరానర్ యీ మూడు హత్యలను ముద్దాయే చేసినట్లుగా ఎట్టి అనుమానాలకు తావులేకుండా ప్రాసిక్యూషను వారు తమ కేసును ఋజువు చేసినారు గనుక కోర్టువారు యీ కేసును నమ్మి ముద్దాయికి మరణశిక్ష విధించ వలసినదిగా కోరుతూ వున్నాను.

(కూర్చుండును)

(కోర్టంతా అలజడిగాను)

జడ్జి : ఆర్డరు – ఆర్డరు – ప్రాసిక్యూషన్ వారు ఇచ్చిన స్టేటుమెంటు విన్నాం కానీ డిఫెన్సు వారు ఏమైనా చెప్పాలో గలరా!

సురేష్: యువరు ఆనరు ఈ కేసులో ముద్దాయి–నేరస్తుడని అనుమాన రహితంగా ప్రాసిక్యూషన్ వారు ఋజువుచేయు లేక పోయినారని ప్రాసిక్యూషను వారు కోర్టులో చెప్పించిన సాక్ష్యాల వలననే తెలుస్తుంది! సతీష్ నిజంగా దురుద్దేశముతో యీ మూడు హత్యలను చేశాడన్న ఆరోపణను

నమ్మదగ్గ విషయంగాదు! సతీస్ స్వార్ధంతోగాని దురా
శతో గాని యీ హత్యలను చేశాడని అనడానికి తగిన
ఆధారాలేమి యీ కేసులో కన్పించడము లేదు! రాత్రి
పదిన్నర గంటలకు ప్రభాదేవి గదిలో హత్య జరిగినట్లు
ఫోన్ కాల్ స్టేషన్‌కు వచ్చింది, పదకొండు గంటలకు
హత్య ప్రదేశమునకు పోలీసులు వెళ్ళినప్పుడు పోలీసులకు
మొట్ట మొదట కనిపించిన వ్యక్తి సతీస్ ఒక్కడే యీ
హత్యలన్ని చేశాడని దోషి అని నిర్ణయించడానికి వీలులేదు
రాత్రి పదిన్నర గంటలకు హత్య చేసిన నేరస్తుడు ఆ గది
లోన అరగంటసేపు ఉంటాడనుకుంటం కేవలం హాస్యా
స్పదం యీ కేసులో సతీష్ పిస్టలు కాల్చునప్పుడుగాని
రఘుని గొంతు పిసికి నపుడు ప్రత్యక్షముగా కళ్ళారా
చూసిన సాక్షి ఒక్కడూ లేడు! హత్య, హత్య అని
పోలీసులకు ఫోన్ కాల్ వచ్చినప్పుడు ఆ విషయాన్ని సబ్
ఇన్‌స్పెక్టరు జనరల్ డైరీలో గాని కేసు డైరీలో గాని
ఎందులోను వ్రాయలేదు. ఎందుకు వ్రాయలేదో వ్రాసి
క్యూషన్ వారు సమర్ధించుకో లేకపోయారు ఇంకొక్క
ముఖ్య విషయం యస్ యువరు ఆనరు యీ కేసులో
హంతకుడైన ముద్దాయి పిస్టలుతో కాల్చినట్లు నేరారోపణ
చేయబడింది! కాని హత్య చేసిన పిస్టలును, కోర్టులో
పోలీసు వారు హాజరు పెట్టలేక పోయినారు! యువరు
ఆనరు అసలు ముఖ్యమయిన పిస్టలును వదిలివేసి పోలీసు
వారు కోర్టులో హాజరు పెట్టలేదు, ఒక జేబుగుడ్డ ముద్దాయిదే

నని హాజరు పెట్టినారు. దానిపై గల యస్ అనే చాకలి గుర్తు సతీస్ పేరునే సూచిస్తుందని పోలీసువారు కట్టుకథను అల్లి అన్యాయంగా అక్రమముగా సతీస్‌పై నేరారోపణ చేసి యున్నారు: యస్ అనే అక్షరము సతీస్ అనే గాక సుబ్బారావు సత్యం సుబ్రమణ్యాం సురేస్ అనే పేర్లకు గూడా వర్తిస్తుందని కోర్టువారికి మనవి చేసుకుంటున్నాను కేవలం జేబుగుడ్డపై చాకలి గుర్తును ఆధారంగా తీసుకొని ఒక నిర్దోషిని ఉరికంబానికి ఎక్కించడం న్యాయంగాదు ! ధర్మముగాదు అదియును గాక శవముపై గల రక్తము మరకలను జేబుగుడ్డపై గల రక్తపు మరకలకు బేధము ఉన్నట్లు కెమికల్ ఎగ్జామినరు రిపోర్టు వలన తేలింది. అంతే గాకుండా రాఘవయ్య కంఠముపై గల వ్రేలిముద్రలకును యీ ముద్దాయి చేతి వ్రేలి ముద్రలకును తేడా ఉన్నట్లు ఫింగర్సు ప్రింటు ఎక్సఫర్టు రిపోర్టు వలన తేలింది కాబట్టి యీ కేసులో అసలు నేరస్తుడెవడో తెలుసుకోలేక పోలీసువారు గాలి ప్రోగుచేసి నిర్దోషి అయిన సతీస్‌పై ఈ హత్యానేరాన్ని మోపియున్నారు ! ఇది అన్యాయము అక్రమము ప్రాసిక్యూషను వారు ఈ కేసును అనుమాన రహితంగా కేసును ఋజువుచేయలేక పోయినారు! కాబట్టి యీవరు ఆనరు ఈ కేసులో ఏదైనా డౌట్ అనేది వుంటె ఆ బెన్‌ఫిట్ ఆఫ్ డౌటు ముద్దాయికి ఇప్పించి ముద్దాయిని విడుదల చేయవలసినదిగా కోర్టువారిని కోరుతూయున్నాను. అసలు నేరస్తుడెవడో అసలు హాత్యచేసిన పిస్టలు ఎక్కడ

వున్నదో ఎవరికీ తెలియదు ! కానీ అసలు రహస్యాన్ని నేను బయటపెడుతున్నాను అసలు పిస్టలు ఇదిగో అసలు హంతకుడు ఇడుగో !

సతి :- తమ్ముడూ !

సురే : అన్నయ్యా అన్యాయంగా అక్రమముగా నేను చేసిన నేరాలకు నువ్వు బలైపోవడం నాకిష్టం లేదు ! నీవు నిర్దోషివి నిజమైన హంతకుడను నేను.

సతి : తమ్ముడూ ఏంటిదంతా !

సురే : ఊరులో అన్నయ్యా యెవరు అనరు యీ మూడు హత్యలను చేసింది నేను నన్ను నమ్మించి మోసము చేసిందన్న అనుమానముతో ఆవేదన చెంది ప్రభను హత్య చేద్దామన్న ఉద్దేశ్యముతో పిస్తోలు తీసుకొని ప్రభ ఇంటికి వెళ్ళాను ! ఈ ఇద్దరి సంఘర్షణ చెలరేగింది ఆమెను పిస్టలుతో కాల్చడానికి ప్రయత్నం చేసేటప్పటికి అకస్మాత్తుగా ఆమె నిజ భర్త నారాయణరావు అడ్డుపడ్డాడు ఆవుక్రోషము పట్టలేక మొట్టమొదటిసారిగా ఆమె భర్తనే కాల్చాను అదే సమయములో ఆమె ఫోన్ కాల్ చేయుచుండగా- నేరము బయటపడుతుందన్న వుద్దేశ్యముతో ప్రభను కూడా అదే పిస్టలుతో కాల్చాను నేను పారిపోడానికి ప్రయత్నించే సమయంలో పోలీసులు వస్తున్న సూచనలు కన్పించగా నా చేదోడు వాదోడుగా వుండే రాఘవయ్య సమయానికి అక్కడకు రాగా నన్ను రక్షించమని ప్రాధేయపడగా తిర

స్కరించాడు ఆవేశము పట్టలేక నా నేరము ఎక్కడ బయటపడునో అన్న భయములో రాఘువయ్యను గొంతు పిసిగి చంపాను! ఈ మూడు హత్యలకు గల కారణము ప్రభాదేవితో నాకు గల అక్రమ సంబంధమే నన్ను రక్షించాలనే ఆవేదనతో నేను ఈ దురాగతమును చేయబోతున్నానని తెలిసినా నా అన్న సతీస్ అక్కడకు వచ్చాడు అప్పుడు నేను పారిపోయాను! పోలీసులు అన్యాయంగా నేరాన్ని అన్నపై మోపి ఈ కేసు పెట్టారు కాబట్టి కోర్టువారు కరుణించి నిర్దోషి అయిన నా అన్నను విడుదల చేసి దోషి అయిన నన్ను శిక్షించ వలసినదిగా కోర్టువారిని కోరుతూ యున్నాను. ఇదిగో పిస్టలు అప్పన్న శరీరములో ప్రభాదేవి శరీరంలో దూసుకుపోయిన గుండ్లు ఈ పిస్టలులోనివేనని పరీక్షించ వలసినదిగా కోర్టువారిని కోరుతూ యున్నాను! రాఘువయ్య కంఠముమీద వ్రేలి ముద్రలు నా వ్రేలిముద్రలుఒకటేనని తెలియజేస్తుంది కోర్టువారుపరీక్షించ వలెనని కోరుతూ యున్నాను ప్రభాదేవిహత్య గదిలో దొరికిన జేబుగుడ్డ నాదే ఆరాత్రి వుద్రేకములో వళ్ళు తెలియక ప్రభాదేవిని కాల్చడానికి పిస్టలు జేబునుండి తీయబోతూ యుండగా అ జేబు గుడ్డ జారిపోయింది దానిపై నున్న యస్ గుర్తు సురేస్ అనే పేరును తెలియ జేస్తుంది! కాబట్టి యీ పై కారణాల వల్లనేనే నిజమయిన హంతకుడనని కోర్టులో రుజువు పరచుకున్నాను న్యాయానికి

ధర్మానికి చట్టానికి తలవంచి శిక్ష ననుభవించడానికి సిద్ధముగా ఉన్నాను! మా అన్న సతీష్‌ని విడుదలచేసి చట్ట ప్రకారము శిక్షించ వలసిందిగా కోర్టువారిని కోరుతూ వున్నాను.

జడ్జి :- (లోపలకు వెళ్ళొచ్చి తీర్పు) ఈ కేసులో దోషిగా ఆరోపించబడిన సతీష్ నిర్దోషి అని నిరూపించబడినందున అతనిని విడుదల చేస్తున్నాం. సురేష్ ఈహత్యలన్నీ చేశాడనీ తగిన సాక్ష్యాధారాలతో ఋజువైనందున సురేష్ నేరస్తుడనీ నిర్ణయించి అతనికి యావజ్జీవిత కారాగార శిక్ష విధించడ మయినది.

(జడ్జి వెళ్ళిపోవును)

(పోలీసులు సురేష్‌కి సంకెళ్ళు వేయుదురు.)

సతీ :- (కన్నీరు కార్చుతూ) ఎంతపని చేశావు తమ్ముడూ ఆనాడు చెప్పినప్పుడు వింటే ఈ అధోగతి వచ్చియుండేది కాదుగదా తమ్ముడు.

సురేష్ :- ఇక నీవన్నా సుఖపడు అన్నయ్యా శెలవు (విడవలేక వెళ్ళుతుంటాడు పోలీసులు నడిపిస్తారు.)

తెర ప్రాలును

నేపథ్యగానము

సమాప్తం

శ్రీ సాయిబాబా పవర్ ప్రెస్, రైల్వేస్టేషన్‌రోడ్ - తెనాలి-2

# మా స్వంత ప్రచురణలు : శ్రీ సత్యసాయిబాబా పేపర్ సేల్స్ & పబ్లిషర్సు మారీసుపేట రైల్వే స్టేషన్ రోడ్ తెనాలి - 2.

## నవలలు

| | |
|---|---|
| అంతరాత్మ | 1-50 |
| స్వయం సిద్ధ 1 2భా॥ | 11-00 |
| ఏది సత్యం (శారద) | 4-00 |
| అందాలరాణి | 1— |
| చెల్లాయి | —50 |
| రమానాధ్ | 2-50 |
| వలలో చిక్కిన వనిత (కొమ్మూరి | 4— |
| ఉరిత్రాడు | 4— |
| కపాలకుండల (బంకింబాబు) | 1-50 |
| గళ్ళ చీర | 1— |
| బాల్యమిత్రుడు | 1— |
| మధుప మంజరి | 0-75 |
| దొంగడుమూతలు | 1— |
| సాహసి గోపి | 1— |
| సవిత (శరత్) | 7— |
| ధన్య కైలాసం నాటకాలు (విశ్వ) | 1— |
| రాజమకుటం | 2— |

## కధలు

| | |
|---|---|
| అపూర్వ చింతామణి | 2— |
| తెనాలి రామకృష్ణ | 2- |
| భట్టివిక్రమార్క | 1-50 |
| స్త్రీల వ్రత కధలు | 1-25 |
| భేతాళ కధలు | 1-25 |

## పురాణములు

| | |
|---|---|
| కార్తీక పురాణం | 2— |
| వైశాఖ పురాణం | 2— |
| మాఘ పురాణం | 3— |
| సాయినాధ చరిత్ర క్యాలికొబైండు | 4— |
| సాయిబాబా చరిత్ర | 4— |
| వీరబ్రహ్మేంద్ర జీవిత చరిత్ర | 6— |
| భగవాన్ సత్యసాయిబాబా చరిత్ర | 5— |

## (ఇతరములు)

| | |
|---|---|
| సత్యసాయిబాబా ఇంగ్లీషు, హిందీ, తెలుగు స్వబోధిని | 2-50 |
| సేల్సుటాక్సు అక్టు తెలుగులో | 2-- |
| దస్తావేజుల మతలబు | 1-50 |

## బాల సాహిత్యం

| | |
|---|---|
| బాలల బొమ్మల భారతం | 2— |
| బాలల బొమ్మల భాగవతం | 2— |
| బొమ్మల బాలరామాయణం | 2— |
| పరంజ్యోతి (నవల) | 1-25 |

## తమాషా పుస్తకములు

| | |
|---|---|
| దసరా పద్యములు | —15 |
| సంసారం ఒక సాగరం | —12 |
| ఆడమొగ మోసాలు | —13 |
| అత్తాకోడలు పోరాటం | —12 |
| కష్టజీవుల కన్నీరు | —12 |
| పెండ్లి పందిరి | —25 |
| గాలివాన | -25 |
| ఏసుప్రభు కీర్తనలు | -12 |
| దారినపోయే దానయ్య | -12 |
| కలియుగ చిత్రాలు | ,, |
| దేవుని కీర్తనలు | ,, |
| వింత ప్రపంచం | ,, |
| రైలు ప్రమాదం | ,, |
| బావామరదలు సంవాదం | ,, |
| తాటిముంజపాట | ,, |
| పెళ్ళికూతురు గళ్ళంతు | ,, |
| సంసారం గుట్టు | ,, |
| కాలం మారింది | ,, |

# మా స్వంత నాటకములు అండ్ ఇతరములు

## శ్రీ జి. యల్. సత్యబాబు

| | |
|---|---|
| ఏది న్యాయం, ఏది ధర్మం | 3-00 |
| న్యూ చైత్మను క్రొత్తగా వేయబడినది | 3- |
| దొంగవీరుడు ,, | 3-00 |
| మమత (అచ్చులో వుంది) | 3-00 |
| రక్తపాతం ,, | 3-00 |
| రక్త తుఫాను | 2-50 |
| ఒకేరక్తం | 2-00 |
| ప్రేమించిన హృదయాలు | 2-50 |
| రౌడి రంగడు | 2-50 |
| జల్సారంగడు | 3-00 |
| కష్టసుఖాలు | 2-50 |
| సవాల్ పై సవాల్ | 2-50 |
| యుద్ధంకావాలి | 1-25 |
| రంగూనువాలా, లోకవిరోధి | 1-00 |
| మరానాదోపిడి | 1-00 |
| అల్లూరి సీతారామరాజు | 1-25 |
| ఎదురుదెబ్బ | 1-25 |
| నారదమునీంద్ర | 1- |
| వింత తత్వాలు (శితంరాజు) | 2- |
| వరకట్నాలు (పెండెం వీరయ్య) | 2- |
| అరయశరం-యాబదిగజాలు ,, | 1-50 |
| కురుక్షేత్రం (నాగశ్రీ) | 1-25 |
| బాలనాగమ్మ ,, | 1-50 |
| సత్యహరిశ్చంద్ర ,, | 1-50 |
| హనుమాన్ పాతాళ విజయం ,, | 1-75 |
| శ్రీకృష్ణరాయబారం | 1-50 |
| రక్తప్రవాహము భాషా | 2-50 |
| ఎవరికి వారే శివశ్రీ | 1-50 |
| దేశభక్తి దోనేపూడి | 0-50 |

| | |
|---|---|
| అరని కన్నీరు (శ్రీగరికపాటి) | 2-50 |
| కట్నాలు — కన్నీరు | 2-50 |
| శిధిల హృదయాలు | 2-00 |
| వంశ ప్రతిష్ఠ | 2-50 |
| రాతిగుండెలు | 3- |
| పుణ్యమూర్తులు | 3-00 |
| రిక్షారంగడు | 3-00 |
| నీవు చెప్పిందే నిజం | 1-50 |
| దేవుడు లేడు | 3- |
| దిక్కులేని పక్షులు | 2-50 |

## శ్రీ శంకరశెట్టి వెంకట్రావు

| | |
|---|---|
| రక్తతిలకం క్రొత్తది 1969 | 4-00 |
| రక్తాశ్రువులు ,, | 4-00 |
| రక్తజ్వాల (కోర్టుసీనుతో సహా) | 4-00 |
| త్యాగశీల | 3-00 |
| శోభనపు రాత్రి (కొడాలి) | 2-00 |
| యింటరంభలుండగ | 2-00 |
| తానొకటి తలిస్తే | 2-00 |
| జాగృతి | 2-00 |
| ఆనందోబ్రహ్మ | 2-00 |
| కౌశల్య పరిణయం (పౌరాణికం) | 2-00 |
| పల్నాటి యుద్ధం | 2-00 |
| రైతురాజ్యం (నాగశ్రీ) | 2-50 |
| పనివాడు | 1-50 |
| సీతాకళ్యాణం | 2- |
| తారాశశాంకం | 2- |
| బైబిలు దొంగలు (జాకబు) | 2-50 |
| మోహిని భస్మాసుర (వీరరాఘవ) | 1-75 |
| వీరరాజయోగి ,, | 2- |